కామేశ్వరరావు, చిర్రావూరు

ఐరోపాదేశ సేవకులు

రాజమహేంద్రవరము, 1917

Record no. 755

Kāmēśvararāvu, Cirrāvūru

Airōpādēśa sēvakulu

Rājamahēndravaramu, 1917

Record no. 755

కామేశ్వరరావు, చిర్రావూరు.
ఐరోపాదేశ సేవకులు / కర్త చిర్రావూరి కామేశ్వరరావు. - 1. కూర్పు. - రాజమహేంద్రవరము: ఆంధ్రసారస్వతనికేతనము, 1917.
v. <1 > ;18 cm.
Record no. 755

Kāmēśvararāvu, Cirrāvūru.
Airōpādēśa sēvakulu / karta Cirrāvūri Kāmēśvararāvu. - 1. kūrpu. Rājamahēndravaramu: Āṃdhrasārasvata Nikētanamu, 1917.
v. <1 > ;18 cm.
Record no. 755

ఆంధ్రసారస్వత ప్రచురములు 22



వి. ఆర్. జగపతివర్మ
సంపాదకుఁడు.



# ఐరోపా దేశ సేవకులు





కర్త

చిట్టాపురి కామేశ్వరరావు

శ్రీ

# ఐరోపాదేశ సేవకులు

[ ప్రథమభాగము. ]





కర్త

చిల్లాపూరి కామేశ్వరరావు

మొదటి కూర్పు

రాజమహేంద్రవరము

ఆంధ్ర సారస్వతనికేతనమువారిచే ప్రకటింపఁబడినది.

**1917.**

రాయవరము.

శ్రీ మేరీ ముద్రాక్షరశాల

**1917.**

# సంపాదకీయ భూమిక



దైవానుగ్రహమున మాచే ప్రకటింపఁబడిన దేశోద్ధారకులు యీసంవత్సరము స్కూలుఫయినలు క్లాసుకు టెక్స్టుబుక్కుగా పడుటచేతను ఆంధ్రసోదరులగు మా చందాదారుల ప్రోత్సాహమువలనను ఇంతవఱకు సకాలములో రెండు నెలలకొక గ్రంథము ప్రకటింపఁ గలుగుచున్నారము. మా కంటె ఎన్నోవత్సరములు ముందుగ బయలుదేరి వేలకొలఁది చందాదారుల నార్జించిన గ్రంథమాల లెట్టి భాషాసేవయు చేయజాలక, కాగితము కరవువలన వెనుకంజ వేయుచున్నను మేమింకను సకాలములో పుస్తకములు ప్రకటింప సంసిద్ధులమై భాషాసేవ చేయదలచితిమని ఆంధ్రలోకమునకు తెలుపుటకు సంతసించుచున్నారము.

యీగ్రంథకర్తలు మాయందలి యవ్యాజానురాగము చేతను భాషాసేవయందలి ప్రీతిచేతను మాకు సకాలములో మనోహరశైలిలో గల తమగ్రంథముల నొసంగుచు మా కృతజ్ఞతకు పాత్రులగుచున్నారు.

విద్యా శాఖాధికారులును మాచందాదారులును వీరి గ్రంథముల నాదరించి మమ్ము కృతార్థులను చేయగోరుచున్నాము.

సంపాదకుఁడు

# ఆంగ్లదేశ సేవకులు

## విలియమ్ పిట్టు

**1759.** వ. సంవత్సరము మేనెల తే 28 దిని విలియమ్ పిట్టుగారు జన్మించిరి. ఆతనితండ్రి విలియమ్ పిట్టు ఎర్లాఫ్ ఛాదమ్‌గారు మాతృభూమియగు ఇంగ్లాండు దేశమునకు మహోపకార మొనర్చిన కుశాగ్రబుద్ధి. చిన్నతనము నుండియు విలియమ్‌పిట్టు దేశీయుల యభిమానమునకుఁ బాత్రుఁడై, విదేశీయులచే నభినందింపఁ బడియెను. ఆతని బాల్యకాలమున వెలిదీవి యభ్యుదయ పరంపరలవడసి యెన్నఁడు సూర్యుఁడు గ్రుంకని రాజ్యము నార్జింపఁ గలిగెను. పరాసు నగరాధిపుఁడగు ( లూ యి. డి. ఫోర్టిన్సు. ) వెస్టఫాలియా నగరమున నాంగ్లేయ కాల్బటులచే నోడింపఁబడియెను. పోర్చుగల్‌తీరమున యోధాగ్రేసరుఁడును, నౌకా దళాధికారియునగు బాస్కావె గారు ఫ్రెంచి నౌకలను ముంచివేసిరి. ఆంగ్లనౌకాధ్యక్షుఁడు 'హాక్కు బేఆఫ్‌బిస్కే' యందు ఫ్రెంచి నౌకాదళమును నష్టపఱచెను. జాన్‌సన్‌గారు నయగ్రాను బట్టుకొనిరి;

అమ్ హార్స్టుగారు టికోండెరోగాను ముట్టడించిరి. ధీవిశాలుఁడు 'ఉల్ఫు' 'క్విబెక్కు' ముట్టడియందు విజయుఁడై ప్రాణములు విడచెను. హుగ్లీనదియందుఁ బరాక్రమశాలి క్లైవు డచ్చి నౌకాదళమును తఱిమివేసెను. విశేషించి యావీరవ్రతుఁడు, కార్యపరతంత్రుఁడు, యోధాగ్రణి, భారతభూమియందాంగ్లరాజ్య స్థాపనమునకు మిక్కిలి పట్టుదలతోఁ బ్రయత్నములు సేయుచుండెను. వాండివాష్ యుద్ధరంగమున; సేనాని 'కూటు' లాలిగారి నపజయమొందించెను; కర్నాటరాజ్యమున నాంగ్లేయాధికారమును స్థాపించెను. ఆంగ్లమాత కీర్తి దిగంతముల వ్యాపించెను. ఆమె కుమారులు నిర్వక్ర పరాక్రమోపేతులై సముద్రాధిపత్యమునకును, శాత్రవ దర్ప భంజనమునకును, మాతృదేశ గౌరవోన్నతికినిఁ బ్రాణములు తృణప్రాయములుగాఁ ధారవోయుచుండిరి. వారియందట్టి నవీనోత్సాహము, దేశభక్తి, కార్యనిర్వహణ బుద్ధిగలుగుటకు ఛాదమ్‌గారు ముఖ్యకారణము. ఆతఁడు గంగానదీముఖద్వారములందును, ఆన్టారియోతీరములందును ఆంగ్లవిజయ పతాకమును నిలిపిన వీరావతారుఁడు; స్వాత్మాభిమాని. ప్రజాసమూహ మాతనిని దేవతాస్వరూపునిగాఁ దలంచి పూజించిరి; కాని యాగౌరవము క్రమముగాఁ బ్రజలయందు క్షీణింపసాగెను. ఆతఁడు 'హావుసాఫ్ కామన్సు' లోనుండుకాలమున నసర్గళవాచా ధురంధరుఁడగుట ప్రాముఖ్యత వహింపఁ



గలిగెను; గాని 'హావుసాఫ్ లార్డ్సు' లోనాతఁడు స్థానమలంకరించినతరువాత యాతని నిరాఘాటవచో విశేషమంత పని చేయలేదు. దానికితోఁడుగా నాతఁడు వ్యాధిబాధితుఁడై యడుగుగదల్పఁ జాలఁడాయెను. ఆతనికి రాజ్యాంగ విషయములందు మనోశాంతి కఱవయ్యెను; గాని గృహమున నాతనికి శాంతిసౌఖ్యములు నిరంతర మనుభవించు భాగ్యము గలిగెను. ఆతఁడు పుత్రవాత్సల్యము మెండుగాఁగలవాఁడు. కుమారుల శ్రేయాభివృద్ధి కాతఁడు మిక్కిలి పాటుపడియెను. కుమారవర్గమున ద్వితీయుఁడగు విలియమ్‌పిట్టుగారి యందాతని కపరిమితాభిమానము. ఆతని బుద్ధి విశేషములు కాతఁడు గర్వము కూడ సూచించెను.

బాల్యమందు పిట్టు తనభావి యౌన్నత్యమును సూచించెను. ఏఁడువత్సరములవాఁడైనపుడాతఁడు జూపిన శ్రద్ధాభక్తులు, గ్రంథపఠన దీక్షస్వాతంత్ర్య భావము, బుద్ధికుశలత, కావ్యవిమర్శనాభిమానము ప్రసంశనీయములు. 1766. వ. సంవత్సరము ఆగష్టు నెలలో నాతనిజనకునకు 'ఎర్లాఫ్ ఛాదమ్' అనుబిరుద మొసంగఁబడిన వార్తనాలకించి యాతఁ డానందముతో నిట్లనియెను. "నేను నాజనకుని జ్యేష్ఠపుత్రుఁడనై జన్మింపమికిఁ బరమాత్మునకు వందనము లాచరించుచున్నాను. నాతండ్రివలె 'హావుసాఫ్ కామన్సు' లోనుపన్యాసము లొసంగ నాకభిమతము కలదు!" ఆతనిజనయిత్రి యొకమాటు భర్త

గారికి వ్రాసిన లేఖలోఁ గుమారుఁడు పిట్టు, పండ్రెండేండ్ల బాలుఁడైనను, పదునైదేండ్ల యన్నకంటె నెక్కుడు బుద్ధిమంతుఁడని పేర్కొనియెను. "వానియీడువారు గ్రహింపఁజాలని విషయ చర్చలందు వానికి మితిలేనియాసక్తి" అనియు నామెవ్రాసెను. పదునాలుగేండ్లప్రాయమువాఁడైనపుడాతఁడు బుద్ధియందు ముదిమి వడసెను. 1773. వ. సంవత్సరమున "హేలె యనుకవి యొకఁడాతనితో భాషింపఁ దటస్థించెను. అప్పుడాతఁడా బాలుని పాండిత్యప్రకర్షకును, బుద్ధిసూక్ష్మతకును మహాశ్చర్యమే కాక భీతిఁగూడఁ బొందెను; తానురచింప నూహించిన కావ్యమునుగూర్చి యాతనితో ముచ్చటింప వెనుదీసెను. ఆదినములందు పిట్టు విషాదాంతనాటక మొకటి విరచించెను. అందలి కథాభాగము స్వకపోలకల్పితము. ఆ కథాసందర్భమున శృంగార వర్ణనములేదు. విషయమంతయు రాజకీయము; ఒకరాష్ట్రాధికారమున కిరువురు పోరాడుదురు. ఒకవైపు రాజుగారి యాప్తభృత్యుఁడును, రెండవవైపు దురాశాపీడితుఁడును దుర్మార్గావలంబియునగు రాజద్రోహియును ముఖ్యపాత్రలు. కొంతకాలమున కెందోయరిగిన రాజు నిజరాజ్యమునకరుదెంచి యధికారముద్ర వహించి, తానులేనప్పుడు తనకై పోరాడిన సేవకుని రాజభక్తికిమెచ్చి వానిని బహూకరించును.—ఆనాటకమిప్పుడు 'చెవెనింగు' అను స్థలమునఁ గాపాడఁబడుచున్నది. ఎన్నియో లోపములందు విశదమైనను, మొత్తముమీఁద



చదువరుల కదియానందదాయకముగా నుండును.

అత్యంత బుద్ధిశాలియగు కుమారునిఁజూచి తల్లిదండ్రులు పొందిన యానందము వర్ణనాతీతము; గాని వారొక విషయమై భయవిచారము లొందవలసి వచ్చెను. చిన్నతనము నుండియు, పిట్టు అనారోగ్యవంతుఁడు; బలహీనుఁడు. పొడుగైన వాఁడైనను ఆతఁడు మిక్కిలి లీనముగానుండెను. వైద్యశాస్త్రజ్ఞు లాతని దేహతత్త్వమును బరిశోధించి పోర్టువైను పుచ్చుకొనుట యుచితమని పలికిరి. బాల్యకాలముననే యాతఁడు వైద్యులహితోపదేశ మనుసరించి భయంకరమగు ఆ మద్యము నుపయోగింపవలసి వచ్చెను. నూటికి తొంబది తొమ్మిదిమంది బాలు రట్టి యభ్యాసమువలన నకాలమృత్యుముఖమునఁ బడుటాశ్చర్యముగాదు; గాని పిట్టుగారి దేహతత్త్వమునకది హానియొనర్పలేదు; పైగా మేలొనరించెను. పదునైదవయేట ఆతఁడు నిర్రోగియాయెను. అహోరాత్రములెడ తెగక పనియొనర్చువాఁడైనను, లండను నగరమున గ్రీష్మకాలమంతయుఁ గడుపువాఁడైనను, మరల యావ్యాధి పొడసూపలేదు. సహజముగా దుర్బలుఁడగుటవలన నాతఁడితర బాలురవలె పాఠశాలలందు విద్యాభ్యాస మొనరించి యుండలేదు. నార్తు, ఫాక్సు, మెల్‌బర్న్' విన్దుహామ్, గ్రే, వెల్లస్లే, గ్రెన్విల్, షెర్డిన్, కానింగ్, మొదలగు దేశభక్తులందఱును పాఠశాలలకరిగి విద్యనేర్చిరి. ఛాదమ్‌గారు కూడ 'ఎటన్'

కళాశాలయందుఁ జేరువడసిరి. పిట్టుగారు గృహమందుననే చదువను వ్రాయను నేర్చుకొనిరి. 'విల్సన్' అనుమతాధికారి యొక్కఁ డాతని విద్యాగురువుగా నియమింపఁబడెను. పదునైదేండ్లప్రాయముననే పిట్టు ప్రాచీన భాషావేత్త యగుటయే కాక గణితశాస్త్ర మందుఁ బ్రావీణ్యము వడయఁగలిగెను. 1773. వ. సంవత్సరమున నాతఁడు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమునకుఁ జెందిన 'పెంబ్రోక్‌హాలు' నకుఁ బంపఁబడియెను. పట్టపరీక్షాదక్షుఁడైన 'ప్రెటీమాన్' అనుగుణాఢ్యుఁడాతని వర్తనాదులఁ బరీక్షించుటకును, విద్యావిషయము లందు సహాయ మొనర్చుటకును, నియోగింపఁ బడియెను. 'ప్రెటీమాన్' గారు విద్యాధన మమూల్యమని యెఱింగి, దానినినడయ నత్యంతపట్టుదలతోఁ బనిచేసిరి. సారస్వతమందుననే కాక, రేఖాగణితమందునను గూడ యాతనికిఁగల పరిచయాభిమానములు కొనియాడఁదగనవి. రెండుసంవత్సరముల వఱకాతఁడు పిట్టుగారి కుపాధ్యాయుఁడును, స్నేహితుఁడునై యుండెను. ఆదినములందు వారికొండొరుల యందుత్పన్నమైన స్నేహాంకుర మచిరకాలములో మహావృక్షమాయెను. కొంతకాలము తరువాత పిట్టుగారాతనియందుఁ దమకుఁ గల ప్రేమాతిశయమున నాతని 'బిషప్ ఆఫ్ లింకాలన్' గాను, 'డీన్ ఆఫ్ సెంటు పాల్సు' గా నొనరించి, గౌరవించిరి. ప్రెటిమాన్ గారును శిష్యునియందుఁగల వాత్సల్యాధిక్యతవలన నాతని జీవితమును



వ్రాసి ప్రకటించి, కృతజ్ఞతఁజూపిరి.

'పెబ్రోక్‌హాలు' నందుండు దినములలో పిట్టుగారికి ప్రెటిమాన్ యొక్కఁడే యాప్తస్నేహితుఁడు. ఆతఁడింకెరితోడను ఆదినములందు పరిచయమధికముగాఁ గలిగించుకొనలేదు. ఉదయాస్తమయములందు దేవునారాధింప మఠమునకుఁ బోవువాఁడు. ఒంటరియై భుజించును; అట్లు దీక్షాదక్షుఁడై యాతఁడు చదువసాగెను. జన్మాధిక్యత కారణమున నాతఁడు పదునేఁడేండ్ల ప్రాయమువాఁడైన తరువాత ఎమ్. ఎ. పరీక్షయందు త్తీర్ణుఁడై నటులంగీకరింపఁ బడెను. తరువాత మఱికొన్ని వత్సరములాతఁడు ప్రెటిమాన్‌గారి హితోపదేశానుగుణముగా శాస్త్రాభ్యాస మొనరించెను. ఆదినములందాతఁడు విద్యార్థి సంఘములందుఁ గలిసి మెలసి నూతనాంశములు గ్రహించియు, మనోభిప్రాయములను తోడివిద్యార్థుల కెఱింగించియు, వివిధ విషయ చర్చ లొనరించియు సంతోషప్రదముగాఁ గాలముఁబుచ్చెను.

గణితశాస్త్రమందాతనికిఁగల యభిమానము కాలక్రమమున నొకవ్యసనముగా మాఱెను. ఆకారణమున గురువులాతని నాశాస్త్రాభ్యాసమునఁ బ్రోత్సహించుటకు మాఱు, నిర్బంధింపవలసి వచ్చెను! ఆతనికంటె సూక్ష్మముగను, సత్వరముగను లెక్కలు చేయనేర్చినవారు కేంబ్రిడ్జి విశ్వవిద్యాలయమున లేరైరి.

గ్రీకు, రోము సారస్వతములందాతని కపారమైన పాండిత్యముండెను. విల్సన్ గారివద్ద నాతఁడు చదువుకొనిన దినములలో నరుదుగా నాభాషలయం దాతఁడు రచనాభ్యాసముఁ జేసియుండెను. ఆకారణమునాతఁడు ఛందోనిబంధనల నెఱింగినవాఁడయ్యుఁ బద్యములల్లు నసమర్థుఁడుగా నుండెను. గీర్వాణ భాషామతల్లి చెల్లెండ్రగు లాటిన్, గ్రీకు, భాషలయం దాతఁ డెట్టి కావ్యమునకైన నర్థమును సమగ్రముగాఁ జెప్పనేర్చెను. గ్రీకు పద్యసారస్వతమునఁ గష్టతమమైన గ్రంథము 'లికోఫ్రోన్' కృతమైన 'కెసాండ్రా' ఆగ్రంథమును పిట్టు విశేష పట్టుదలతోఁ జదువనారంభించి దానియర్థమంతయును గ్రహించెను.

ఆధునిక సారస్వతమందాతనికి శ్రద్ధతక్కువ. ఫ్రెంచి భాషయందాతని కొకింత పరిచయ ముండెను. మాతృభాషోద్ధారకుల నాతఁడెందఱినో యెఱుఁగడు; నాటకరచనా విశారదుఁడైన 'షేక్స్పియరు' మహాశయునిఁ, గావ్యాలంకారచూడామణియగు 'మిల్టన్' కవిని నాతఁడు పఠించెను. 'పెండిమోనియమ్' అనుగ్రంథమునఁగల వాగ్వాదమాతని కెంతయో సంతోషకరముగా నుండెను. 'బేలియమ్' అనువాఁడొసంగిన యుపన్యాస మాతఁడు మాధుర్యరసమొలుక, గంభీరనిస్వనముతో మిత్రసంఘములందు మనోహరముగాఁ జెప్పుచుండువాఁడు. ఆతనితండ్రి కడుశ్రద్ధవహించి వక్తృతాభిమానధనునిఁ



జేయవలయునని పూనుకొనియెను. ఉపన్యాసములొసంగునపు డెట్లు వర్తింపవలయునో, సభికుల మనోగతముల నెట్లాకర్షింపఁ జేయవలయునో యాదిగాఁగల క్రమములందు సమర్థునిగా నొనరించెను. ఆతని వచోవిశేషమున కచ్చెరువడి 'బ్రూక్సు' గారొకానొకప్పుడిట్లనిరి. "ప్రజాసందోహములు నీయుపన్యాసములాలకించు సమయములందు దివారాత్రము లెఱుంగరు. నిన్నింత సమర్థునొనరించిన మీతండ్రి ననవలయును!"

ఆతఁడు గఱచినవిద్య పార్లమెంటు సభలయం దుపన్యాసములిచ్చుట కాతని కనుగుణముగానుండెను. ఆకాలమందు విద్యాధికమండలికొక యభిప్రాయముండెను; ప్రాచీనభాషా వేత్తలు మాతృభాషాపరిజ్ఞానము గలవారరుదు; వారుభావోదయమగునటుల, సరళశైలిని మాతృభాషయందు రచింపఁ జాలరు; మాటాడఁజాలరు. ఈయభిప్రాయము కొంతవఱకు నిజమైనను పిట్టుగారి విషయమునమాత్ర మర్థవిహీన మయ్యెను. ఆతఁడు చిన్నతనమందు గ్రీకు లాటిన్ భాష లభ్యసించినవిధము మిక్కిలి శ్లాఘనీయము; గ్రంథపఠనారంభమునకుఁ బూనునపు డాతఁడొకటి రెండుపుటలు చదువును; అర్థమును మనోగతమునకుఁ జెందునటుల గ్రహించును; తరువాత మాతృభాషలోనికను వాద మొనరించును. ఈవిధముగా గ్రంథావలోకన మొనరించుట 'విల్సన్' గారివద్ద చదువుకొనుదినములం దాతనికలవడెను. ప్రెటిమాన్ గారివద్ద నుండు దినములలోఁ గూడ

యాతఁడాయభ్యాసము విడువలేదు. అట్లు కడు జాగరూకుఁడై విద్యావిషయముల మెలఁగనేర్చిన వాఁడగుట నాతఁడు మాతృభాషయందు రచనా వ్యాపారములను, సర్వసమాదరణీయములగు నుపన్యాసము లిచ్చుటయందును నద్వితీయుఁడాయెను.

ప్రాచీన గ్రంథములం దాతఁడు కథాసందర్భోచితోపన్యాసములను మిక్కిలి మెచ్చుకొనుచుండెను. మాతృగృహమందుండు దినములం దాతఁడు 'వెస్టుమినిస్టర్ హాలు'నకుఁ దఱచుగాఁ బోవుచుండెను; అచ్చటిసభ్యుల వాదోపవాదముల నతిశ్రద్ధాళుఁడై యాలించుచు, ముఖ్యాంశములను గ్రహించుచుండెను.

1778. వ. సంవత్సరము ఏప్రెల్ తే 7 దిని పిట్టుగారి యుత్సాహము మేఘాచ్ఛాదిత మయ్యెను. ఆదినమున నాతఁడు తండ్రిగారితో పార్లమెంటు భవనమున కరిగెను. ఫ్రెంచివారు యునైటెడ్‌స్టేట్సు స్వాతంత్ర్యము నంగీకరించినవార్త సభ్యులకందరకును తెలిసియుండెను. 'డ్యూక్ ఆఫ్ రిచ్ మాండు' గారు యునైటెడ్‌స్టేట్సు ఆరంభించిన రాజ్యాంగాందోళనము మట్టిపెట్టుట కష్టసాధ్యమని యభిప్రాయ మొసంగిరి. ఛాదమ్ గారు అధినివేశ రాజ్యములకు స్వరాజ్యముఁ బ్రసాదించుటత్యంతావశ్యకమని రూఢిగాఁ బల్కిరి; గాని యాతఁడొకతప్పు యభిప్రాయముఁ గల్గి యుండెను; అధినివేశ రాజ్యములు



స్వాతంత్ర్యము వడసిన యుత్తరక్షణమున నింగ్లాండు దేశోన్నతి ముగియునని యాతఁడు వచించెను. ఛాదమ్‌గారు వయోభారముననేగాక, రోగాధిక్యత వలనఁ గూడ బాధపడుచుండిరి. సభయందు ముచ్చటింపవలదని బంధుగణమాతనిని ప్రార్థించెను. ఆతఁడు దేశభక్తుఁడగుట వాక్ప్రవాహములందు సభ్యులను ముంచివేసెను. ఆయాసమధికమగుట వలన నాతఁడు భరింపఁజాలడయ్యె. కుమారుఁడు పిట్టు ఆతనినుచితస్థలమున నాసనాసీనునొనరించెను. కొలఁదికాలము తరువాత యాతఁడు పరలోకమలంకరించెను! 'వెస్టు మినిస్టరు అబ్బే' యందాతని శవమును యథావిధిగాఁ బూడ్చిరి.

తండ్రి మరణానంతరము పిట్టుగారు ఉద్యోగమునకు వెదకవలసివచ్చెను. ఆతనియన్న ఎర్ల ఆఫ్ ఛాదమ్ అంత ధనవంతుఁడు కాఁడు. బంధువులలో ధనాఢ్యులెవ్వరును గానరాలేదు. ఆకారణమున నాతఁడు 1780. వ. సంవత్సరము వసంతాగమనమున 'కేంబ్రిడ్జి' విశ్వవిద్యాలయమును విడువవలసివచ్చెను. సర్ జేమ్సులోథర్ గారి సహాయమున నాతఁడు 'ఎప్లెబి' యను బరోప్రతినిధిగా పార్లమెంటు సభలోఁ జేర్చుకొనఁబడియెను.

ఆదినములం దింగ్లాండు దేశము విపదాంబుధిఁ మునిఁగిపోవునటులఁదోఁచెను. నార్తమెరికా దేశమున అధినివేశము లేర్పఱచుకొనిన వారియుల్లురులు మిన్నుముట్టెను. ఆంగ్లభట

కదంబులన్నియు రణరంగమున నాశనమొందింపఁ బడియెను. అధినివేశములవారు జయాభికాంక్ష నెడతెగక పోరాడఁదొడంగిరి. ఇంతియకాదు. ఫ్రెంచివారును స్పెయిన్‌వారును సంధి జేసికొనిరి; ఇంగ్లాండు దమకొనరించిన పరాభవమునకుఁ బ్రత్యుపకారము సేయుటకు బద్ధకంకణులైరి. హాలండువారు వారికి సహాయులై నిలచిరి. మధ్యధరా సముద్రాధిపత్య మాంగ్లేయులకుఁ గొంతకాలము నశించెను. ఇంగ్లీషు ఛానల్‌యందు బ్రిటిషుపతాకముఁ గానఁబడుటరుదయ్యెను. తటస్థదేశముల నిరుత్సాహము భయానకమైయుండెను. తూర్పుదేశమున కార్యోత్సాహము హైదరాలికర్ణాటరాజ్యలక్ష్మినిఁ బట్టుకొన సేనాయుతుఁడై యరుదెంచెను; బెయిలీగారి వాహినీ సముదయము నింకించెను; ఫోర్టుసెంటుజార్జి ప్రాకారముల వఱకు భయము నెలకొనఁజేసెను. ఐర్లెండు నందుఁ బొడసూపిన స్వరాజ్యాందోళనము నానాటి కధికమై యంతఃకలహమారంభమగునేమోయను భయముగలిగించెను. మాతృదేశమున రాజ్యాంగవ్యవస్థ మిక్కిలి హీనదశయందుండెను. చక్రవర్తియును, పార్లమెంటువారును ప్రజాభిమానమునకు దూరమైరి. పార్లమెంటు వ్యవహారక్రమములను మార్చవలయునని ప్రజలాందోళనము సేయఁదొడంగిరి. ప్రతినిధుల నెన్నుకొను విధమున మార్పు అవశ్యమని గుణవంతులును, ధనవంతులును, విద్యావంతులును, ఆందోళన మొనరించిరి. రాజ్యాంగ దౌర్బ-



ల్యము క్రమముగా హెచ్చుచుండెను. ప్రజలు తిరుగబడిరి. న్యాయసభలు ముట్టడించిరి; అధికారులఁ బడఁద్రోసిరి; మతగురువులఁ దరిమివేసిరి; రాయబారులను పరిభవించిరి; కారాగృహములు తెరువఁబడియెను. గృహములెన్నియో జాతవేదున కాహుతియాయెను. లండనునగరము భయవివశమై తుపానుమధ్యమున నున్నట్లుండెను.

విదేశములందును, మాతృభూమియందును విశదముగా గలిగిన యలజడి కించుకేనియు జడియక రాజేశ్వరుఁడు తృతీయజార్జి అమెరికావారి నణఁపఁగంకణము గట్టుకొనియెను. మంత్రులుకూడ యాతని చిత్తవృత్తి ననుసరించిరి; వారిలోఁ బెక్కండ్రు రాజానుగ్రహము వడయ నాశించి యుక్తాయుక్త మెఱుంగక యాతని యభిమతము నొందలఁదాల్చిరి; గాని ‘ నార్తుప్రభువు ’ రాజాజ్ఞను శిరసావహించినను, స్వలాభమున కట్లొనరింపలేదు. ఆతఁడు మానాభిమాని; ఋజువర్తనుఁడు; కార్యోత్సాహి; నిరంకుశ ప్రతిభావిభవుఁడు; వచోరచనా కలాపుఁడు. రాజుగారివర్తన మాతనికించుకేనియు నిష్టములేదు. ఉద్యోగము మానుకొనవలయునని యెన్నియోసారులు ప్రయత్నించెను; గాని రాజంగీకరింపలేదు; ప్రేమాతిరేకమునఁ జూచు యజమానునిఁ గష్టదశయందు విడనాడుటకు వివేకధనుఁ డంగీకరించునా? యట్లొనరించుట బాడియొకో? యనిజార్జిగారు జాలిగదురఁబల్కుచుండిరి.

అమాత్యులును రాజోద్యోగులును రెండుపక్షములుగా విభజింపఁబడి యన్యోన్యకలహోన్ముఖులై దేశమున కెంతయో నష్టమాపాదించిరి; గాని యమెరికావారు తిరుగఁబడి నపుడా రెండుపక్షములును సఖ్యము గావించుకొని మాతృదేశ గౌరవరక్షణార్థము పట్టుదలవహించిరి. ఆపక్షములలోఁ బెద్దది 'విగ్గు' సామంతుల యాధిపత్యమునందు నడపఁబడుచుండెను. వారిలో ఛార్లస్, మార్క్విస్ ఆఫ్ రాకింగ్ హామ్‌గారు ముఖ్యులు. ఆతఁడు సన్మార్గవర్తనుఁడు; ధీవిశాలుఁడు. ధనాధిపుఁడు; పార్లమెంటు సభావ్యవహారములం దత్యంతాభిమాని; గాని యాతని యందొకలోప ముండెను. పార్లమెంటు సభలం దాతఁడు ధైర్యముగా మాటాడఁజాలకుండెను. ఆకారణమున 'ఫాక్సు' మహాశయుఁడు పార్లమెంటు సభలను నడపుచుండెను. ఆతఁడు సన్మార్గవర్తి యని చెప్పుటవలన నతిశయోక్తి దోషముగలుగును; ధనమంతయును దురలవాటులకు లోనై యాతఁడు వెచ్చించెను; గాని ప్రజలాతనియం దసూయాభావ మూనలేదు. మీదుమిక్కిలి యాతనిని ప్రేమించిరి. ప్రజలయభిమానము వడయుట కాతని గంభీరధీవిశేషము, మృదుమధుర మనోవాత్సల్యము, ముఖ్యకారణములు. మేధానిధియు, భావనాశక్తిమంతుఁడును, వాఙ్మయ ధురంధరుఁడును, అగు 'ఎడ్మండు బర్కు' ఫాక్సుగారి హితవు ననుసరించుట కంగీకరించెను.

పైనఁ బేర్కొనఁబడిన రెండుపక్షములలోఁ జిన్నది



ఛాదమ్‌గారి యనుచరులచే నిలవరింపఁబడియెను. వారిలో మొనగాఁడు విలియమ్ ఎర్లాఫ్ షెల్‌బర్ను! ఆతఁడు రాజనీతి సమగ్రముగా నెఱింగిన మహానుభావుఁడు. విశేషించి ప్రకృతిశాస్త్ర పారంగతుఁడు; సారస్వతమం దభిరుచిగలవాఁడు. ఆతని సహచరులు ముగ్గురు; మొదటియాతఁడు 'కామ్‌డెన్' ప్రభువు, మిక్కిలి సమర్థుఁడు; రాజ్యాంగవిశారదుఁడు; ధర్మవర్తనుఁడు. రెండవ యాతఁడు 'బారె' నిరాఘాటవచో విలాసుఁడు, మూఁడవయాతఁడు 'డన్నింగు' న్యాయశాస్త్రవిదుఁడు. పిట్టుగారు సహజముగా నీపక్షమువారి వలన నాకర్షింపఁబడిరి.

1781 వ. సంవత్సరము ఫిబ్రెవరి తే 26దని ఆతఁడు 'బర్కు' గా రుపపాదించిన ఆదాయవ్యయ సంస్కరణమును గూర్చి యభినందించుచు నుపన్యాసమొసంగెను. పార్లమెంటు సభయం దాతఁడొసంగిన మొదటియుపన్యాస మదియ. అప్పటి యాతని రాజసము, భావోన్నతి, యుత్సాహము, కలస్వనము, వాగ్ధోరణి, సభికులహృత్ప్రదేశములం దనిర్వచనీయసంతోష వాహినిఁ బాఱఁజేసెను. 'బర్కు' గారాయువకుని నవీనోత్సాహమున కానందమూని, "ఇది యాపాతదుంగకుఁ జెందినముక్క కాదు, ఆపాతదుంగయే!" యనిపల్కెను. ఒకానొకసభ్యుఁడత్యంతాదరముతో, "పిట్టు కొలఁది దినములలో పార్లమెంటు సభికులకు మొనగాఁడగును!" అనిపలికెను. ఎదిరితెగ కధికారియగు ఫాక్సు అసూయాపరుఁడుకాఁడు

కావున, "పిట్టు కొలఁదికాలములో మొనగాఁడగుట యేమి? ఆతఁడిదివఱకే యట్టి మహోన్నతపదవి యందియున్నాఁడు!" అనిపలికెను.

తరువాత మఱిరెండు సారు లాతఁడు పార్లమెంటు భవనమున నుపన్యాసము లిచ్చెను. ఆసమయములం దాతని కీర్తి చాలదూరము ప్రాకెను. 'బుల్లక్' గారును 'డన్నింగు' గారును ఆతని ననేక విధముల నభినందించిరి.

ఆసంవత్సరముననే నవంబరు తే27 దిని పార్లమెంటుసభ మఱియొకసారి కూడెను. అంతకు రెండుదినముల క్రిందట యొకదుర్వార్త వినవచ్చెను; సేనాని 'కార్న్వాలీసు' సైన్యసమేతుఁడై శాత్రవబలమునకు లోఁబడియెను. దేశీయులందఱు 'అమెరికా' వారిని జయించుట దుస్సాధ్యమనియు, పేరాసయనియుఁ దలపోసిరి; గాని ధరణీశ్వరుఁడు తృతీయజార్జి భయపడలేదు. ఆతరుణమున పిట్టుగారొసంగిన యుపన్యాసమత్యంతము శ్లాఘనీయముగా నుండెను. సభికులు పెక్కండ్రాతని నభినందించి తమ సంతోషము నెఱింగించిరి. 'లార్డు అడ్వొకేట్ ఆఫ్‌స్కాట్‌లాండు' అగు 'హెన్రీడన్డాస్' గారు పిట్టును మిన్నుముట్ట పొగడెను. రాజకీయవ్యవహార విదుఁడగుట నాతఁడప్పటి రాజ్యాంగ వ్యవస్థ క్షీణించునని గ్రహించి యాత్మగౌరవరక్షణార్థము మెల్లమెల్లన దూరముగాఁ దొలఁగిపోయెను. పిట్టుగారితో నాతనికాదినమున సిద్ధించిన స్నేహాధనము నానాఁ



టికి వర్ధిల్లి, బలాధిక్యము వహించి, యాతని మరణదినము వఱకును సుస్థిరత వహించెను.

పదునైదు దినముల తరువాత, ఆహారనిర్ణయవర్గము వారితో సేనాసముదయమునకు వలయు బదార్థపరిమితినిఁ గూర్చి పెట్టి ముచ్చటించెను. కోశాగారమున విమతత్వము బొడసూపెను. 'సెక్రిటరీ ఆఫ్ స్టేటు' అగు 'జార్జి జర్మైని' ప్రభువు సర్వసేనావ్యవహార వర్గమున కధిపతిగా నియమింపఁబడియెను; గాని యాతఁడొనరించిన ప్రయుక్రమము కోశాధ్యక్షుని లెక్కకు సరిపోవలేదు. తక్కుంగల యధికారులు స్వలాభమునకై మిక్కిలిపాటుపడిరి. పిట్టుగారి కారాజోద్యోగిజనమందు మిక్కిలి కోపము గలిగెను. "రణరంగ విచారదుఁడగు 'ఎగమెమ్నన్' కును శత్రుభీకరుఁడగు 'ఎకిలీస్' నకును గలిగిన వివాదము శాంతమూర్తి 'నెస్టర్' తీర్పుసేయు వఱకు నేను వేచియుండెదను! ' అని యాతఁడు మెల్లగా 'సమయోచిత భంగి వారితోఁ బలికెను.

తరువాత నానాఁటికి మంత్రివర్గమున నంతర్గర్భితమై యుండిన యసహనభావము ప్రజ్వరిల్లెను. ఆకారణమున నమాత్యులు తమతమపదవులనుండి వెడలిపోయిరి. తృతీయజార్జి యిష్టము లేకుండినను సమయానుకూలము గావున 'రాకింగ్‌హాము' గారిని ప్రధానమంత్రిగా నియమించెను. 'ఫాక్సు' 'మెల్‌బర్న్'లు 'సెక్రిటరీస్ ఆఫ్ స్టేటు' గా

ఎన్నుకొనఁబడిరి. జాన్ కావెండిష్ ప్రభువు ఛాన్స్లర్ ఆఫ్ ది ఎక్స్చెకర్‌గా నిశ్చయింపఁబడియెను. హౌసుసాఫ్ లార్డ్సు యందు మిక్కిలి సమర్థుఁడుగా నుండిన 'థర్లో' మహాశయుఁడు 'ముద్రాధికారమును త్యజింపలేదు. 'షెల్‌బర్ను' గారి సహాయమువలన పిట్టు ఐర్లెండునకు ఉపరాజాధ్యక్షుఁడుగా నియమింపఁబడియెను; గాని యాతఁడొడంబడలేదు. కాబినెట్టు సభలయందు స్థలమునకాతఁడెట్టి గొప్పయుద్యోగమైనను బరిత్యజింప నుద్యుక్తుఁడుగా నుండెను. హౌసు సాఫ్ కామన్సులో నాతఁడు తనమనోగతమును వెల్లడిపఱచెను ఆదినములందు 'కాబినెట్' సమితి మిక్కిలి చిన్నదిగానుండెను పదిపదునొకండుగురు సభ్యులసంఖ్య మిక్కిలి యధికముగానున్నదని వచించుచుండిరి. సాధారణముగా నేఁడుగురేతత్సభాభవన మలంకరింపవలయునను నిశ్చయమొకటి యుండెను. మహానుభావుఁడు 'బర్కు' నకుగూడ యందుఁ గూర్చుండ వలనుపడినది కాదు ఆకారణమున పిట్టుగారి మనోభీష్టము గొంతిమకోరిక యని పెక్కండ్రు పార్లమెంటు సభికులాక్షేపించిరి. పిట్టుగారు తమ హృద్గతమును వెల్లడి చేసినందుల కత్యంతము పశ్చాత్తాపమొందిరి; గాని యొకానొకప్పుడు మనోవాంఛ తీర్చుకొనవలయునని దృఢప్రతిజ్ఞబూనిరి. ప్రజలందరాతని వర్తనాదులందు ఛాదమ్‌గారి ప్రతిబింబమును విలోకించి యుత్సాహమూనిరి; తండ్రిగారికి సహజములగు కార్యోత్సాహము, వీర



ప్రీతాభిమానము, బుద్ధిబలాధిక్యత యీతనియందు మనోహరములై ప్రజ్వలించెను. తండ్రిగారికివలెనే యీతనికిగూడ రాజసము, దూరాలోచనము సహజములయ్యెను. పిట్టుగారి కొకవిధమైన గర్వముండినటుల ప్రజలెఱింగినను బాధకరమైనది కాదని గ్రహించి యాతనికిఁగల యభిమానమాతనికి వన్నెఁదెచ్చుచున్నదని పల్కిరి. మూఁడువందల పౌనులతో స్వాతంత్ర్యసౌఖ్యమనుభవించుచు దినములుబుచ్చు బారిస్టరొకఁడు మూఁడువేల పౌనులు జీతమిచ్చినను పరాధీనత కంగీకరింపనిచో నాతఁడు మహాగర్వియని మధుర స్వాతంత్ర్యమును జవిచూచినవాఁ డెవ్వఁడనఁగలఁడు? ఇతరులచే నిర్మింపఁబడిన చట్టముల గౌరవమును గూర్చియే మాటాడుట. కాతఁడు బద్ధకంకణుఁడుగాలేదు; ఆతఁడు పరాధీనత కంగీకరింపలేదు! ఇది గర్వముగాదు; మానవప్రకృతి. పిట్టు నిజమైన మానవుఁడగుట, అభిమానధనుఁడగుట, తనస్వామ్యమును స్థిరపఱచుకొనియెను.

రాకింగ్ హామ్‌గారి రాజ్యాంగ నిర్మాణ క్రమమున కెంతయు పిట్టు సహాయమొనరించెను. పార్లమెంటుసభల కాలపరిమితి తగ్గించవలయునని యాతఁడు వాదించెను; ప్రతినిధుల నెన్నుకొనుపద్ధతి దుఱవస్థ యందున్నదని నిర్ధారణపఱచెను; చిన్నగ్రామములనుండి వచ్చు ప్రతినిధుల సంఖ్య యధికముగా నున్నదని నొక్కివక్కాణించెను; రాజ్యాంగ పద్ధతికావిధము విరుద్ధముగా నున్నదని ఋజువుపఱచెను. 'ఫాక్సు' మహా

శయుఁ డాతని తీర్మానములు నిష్కృవములని పలికెను; గాని యట్లుపపాదింపఁ బడిన తీర్మానము లంగీకరింపఁబడలేదు.

మంత్రులయందుఁ గాని తక్కుంగల రాజకీయోద్యోగులందుఁగాని, జార్జిప్రభువునకు నమ్మకములేదు; ఇష్టములేదు. మరియు నుద్యోగిజన మన్యోన్యకలహములచే నానాఁటికిబలము గోల్పోవసాగెను. ఛాన్సలర్ గారియం దితరోద్యోగుల కనుమానమే కాక యసూయకూడ సాంద్రముగాఁ బెఱిఁగియుండెను నియోగిజన మొండొరుల నాశనమునకుఁ బాటుపడుచుండిరి. నానాఁటికి వివాదములు, దురభిమానములు, అన్యోన్యవినాశహేతు భూతములగు కుట్రలు, ఎడతెగక ప్రబలసాగెను. ‘ కాబినెట్ ’ సభయందు మాత్రము రాకింగ్‌హాముగారిగౌరవోన్నతికారణమున శాంతము నెలకొనియుండెను అట్టితరుణమందాయుదార గుణాలంకారుఁడు పరలోకమునకుఁ బ్రయాణోన్ముఖుఁడాయెను.

అంధకారము దట్టముగాఁ గ్రమ్ముకొనియెను. రాకింగ్‌హామ్‌గారి మిత్రమండలి డ్యూక్ ఆఫ్ పోర్టులాండుగారి యాధిపత్యముక్రిందనుండుట కభిలషించిరి. తృతీయజార్జి మంత్రుల మనోగతమనుసరించి వర్తించువాఁడుకాఁడు. ఆతఁడు ప్రజాహితమునుగోరి, బాగుగా నాలోచించి, యుత్తమమని తనకుఁ దోఁచునేని యట్లొనరించును. షెల్‌బర్నుగారిని కోశాధ్యక్షునిగా నాతఁడు నియమించెను. ఫాక్సుగారును, జాన్ కావెండిష్



ప్రభువుగారును. బర్కుగారును, నరేంద్రుని వర్తనమున కంగీకరింపలేదు; వెంటనే యుద్యోగములను విడిచిపెట్టిరి. ‘ షెల్‌బర్ను ’ సమర్థుఁడైనను రాజ్యాంగమును సరిజేయుట కవకాశము గలిగించుకొనఁ జాలఁడయ్యె; ఆతఁడొంటరిగా నెదటి పక్షమునఁగల వక్తలతో వాదోపవాదములు సేయుట కష్టతరముగా నెంచెను; వచోధురంధరుని సహాయమాతనికవసరముగాఁ దోఁచెను. పార్లమెంటు భవనమున మధ్యందినాంత మణివలెఁ బ్రకాశించుచుండిన పిట్టు మహావక్తయని యున్నత యశోవిశాలుఁడాయెను. అడ్డులేని వాగ్ధోరణి, మొక్కవోని ధైర్యము అను గుణరత్నద్వయ మాతనియందు సదా ప్రకాశించుచుండెను. ఆకారణమున నాతనికి ‘ ఛాన్సలర్ ఆఫ్ఎక్స్‌కర్ ’ పదవి యొసంగఁబడియెను; ఆతఁ డాదరానందములుప్పొంగ ననుమతించెను. అప్పటికాతని కిరువదిమూఁడవ వత్సరమింకను నిండలేదు.

అధినివేశరాజ్యముల స్వాతంత్ర్య మాంగ్లమాత గ్రహించెను. అమాత్యవర్గమున సంఘీభావము కఱవయ్యెను; ‘ హావుసాఫ్ కామన్సు ’లో మూఁడుకక్షులు ప్రత్యక్షములయ్యెను ఫాక్సుగారి స్నేహితులు కొందఱు; నార్తుగారి మిత్రులు మఱికొందఱు. షెల్‌బర్నుగారి సహచరులు వేఱొక కొందఱు. ఫాక్సుగారికి షెల్‌బర్నుగారి యందొక విధమైన యసూయాభావము జనించెను; ప్రబలెను. మంత్రివర్గమున

సంఘీభావము నెలకొల్పవలయునని పిట్టుగారు తలంచిరి. దేశ మంతయు విషాదాంధకారమున నుండెను. అట్టియెడ మంత్రుల కలహములు ప్రజానష్టమును గలిగింపకమానవు. దీర్ఘదర్శియగు పిట్టు తద్విషయ గ్రహణ మొనరించి ఫాక్సుగారిని సమీపించెను రాజాజ్ఞనుబొంది 'యుద్యోగమున కాతని నాహ్వానము చేసెను ఫాక్సుగారు, "షెల్‌బర్ను ప్రధానమంత్రిగా నుండువాడేనా?" యని యడిగిరి. అవునని పిట్టుబదులుచెప్పెను. "షెల్‌బర్ను క్రింద నే నుద్యోగముసేయుట అసంభవము; అనియాతఁడు తనయసూయత వెళ్లఁగ్రక్కెను. ఆకారణమున ఫాక్సుగారు నార్తుగారితో సఖ్యముగావించుకొనిరి. ఆమహావక్తలు అధి నివేశరాజ్యములతో సంధి యొనర్పరాదని నిశ్చయించిరి.

1783. వ. సంవత్సరము జనవరినెలలో పార్లమెంటు సభ కూడెను. ఫిబ్రవరి తే 17 దిని సంధి విషయమునుగూర్చి చర్చప్రారంభమాయెను. పిట్టుగారి కాదినమున దేహారోగ్య మొకింత చెడియుండెను ఆదినమున నాతఁడు సహజ గాంభీర్య నాద ముప్పతిల భాషింపఁజాలఁడయ్యె. ఆకారణమున నాతని యుపన్యాసము సభికుల మనోదేశముల నాటుకొనలేదు; గాని పిట్టుగారు అధైర్యమూనలేదు. మఱికొన్ని దినముల తరువాత అమెరికావారితో సంధి తగదని ఫాక్సు మొదలగువారు పల్కుచు నపుడు, పిట్టుగారు సభామంటపమున నిలువంబడి, మహోన్నత శిఖరమునుండి ప్రవహించు వాహినివలె నిరాఘాటముగా,



సభికుల హృదయములు సంతోషమున పారవశ్యము జెందు నటుల నుపన్యాసమొసంగిరి. "ప్రజాహితమును, లోకకల్యాణ మునుగోరుటే రాజులధర్మమేని, యుద్ధ మంత మొందింపవల యును, అమెరికావారికి స్వాతంత్ర్యము ప్రసాదింపవలయును." అనియాతఁడు ప్రతిమాటయు నొక్కిపలికెను.

పిట్టుగారియందు తృతీయజార్జి కభిమానము మెండు. కోశాధ్యక్షత గ్రహింపుడని యెన్నిసారులు వేడినను పిట్టుగా రంగీకరింపలేదు; నయమున భయమున రాజేంద్రుఁడాతనికా పదవి గ్రహింపఁగోరెను; గానియాతఁడు వెనుదీయుచునేయుం డెను. రాజ్యాంగ పునర్నిర్మాణమునందు డ్యూక్ ఆఫ్ పోర్టు లాండుగారు ప్రథమ కోశాధ్యక్షుఁడుగా నెన్నుకొనఁబడిరి; థర్లోగారు తొలఁగింపఁబడిరి. ఫాక్సు, నార్తుగార్లు సెక్రటరీస్ ఆఫ్ స్టేటుగా నియమింపఁబడిరి. వారలకు సమానాధికారము లొసంగఁ బడియెను; గానిఫాక్సుగారే ప్రధానమంత్రిగా వర్తించుచుండిరి.

ఆదినములందు పిట్టుగారు తీర్మానమొకటి యుపపాదించిరి; పార్లమెంటు సభాచర్యలందు సంస్కార మావశ్యకము. కౌంటీలనుండి నూరుగురు ప్రతినిధులను హౌసాఫ్ కామన్సులోఁ జేర్చుకొనవలయును; పట్టణ రాజములనుండి పలువురు ప్రతినిధులను జేర్చుకొనవలయును; విశేషించి, చట్టమొకటి నిర్మింపవలయును; ప్రతినిధుల నెన్నుకొను సమయమున ఓటులొసంగు

వారు లంచములు పొందినటుల తెలిసినపుడు వారి కోటు లోసంగు స్వామ్యము తప్పింపవలయును. పిట్టుగారి తీర్మాన మంగీకారము పడయలేదు. 149 గురు అంగీకరించిరి; 293 అంగీకరింపలేదు.

పార్లమెంటు సభ విడిపోయిన తరువాత పిట్టుగారు ఐరోపాదేశమును వీక్షింపఁబోయిరి. ఆతఁడదివఱ కెన్నఁడును తద్దేశమున కరిగియుండలేదు. ఆతని ప్రియమిత్రుఁడు విలియమ్ విల్బర్ ఫోర్సుగా రాతనితో యూరోపునకుఁ బోయిరి. విల్బరు ఫోర్సుగారును పిట్టుగారును సమవయస్కులు పార్లమెంటు సభలం దాతఁడు విశేషగౌరవము నార్జించెను. ఉదారగుణ సంపన్నుఁడగుట వలనను, నిర్మలమానసుఁడగుట కారణమునను చతురవచో విదుఁడగుట వలనను, అమృతరసమును జిమ్ము మహావక్త యగుటను, పిట్టుగా రాతనియందు స్నేహభావ మూనిరి. ప్రియమిత్రసమేతుఁడై పిట్టు సభ్యతకుఁబుట్టి నిల్లగు పరాసు నగరమునఁ గాలువెట్టెను. ఆంగ్లమాత ముద్దుబిడ్డఁడు, మంత్రిశిఖామణి యరుదెంచునను వార్త తత్పూర్వమే యెల్లెడ వ్యాపించుటవలన నాతనిం జూడనెంచి ప్రజలు గుమిగూడిరి. గౌరవనీయుఁడగు ఫ్రెంచియాతఁడొకఁడు ఫాక్సుగారిని గూర్చి పిట్టుగారితో నిట్లనియెను. "ఐహికసుఖములకు లోనై తరుణముతప్పి జూదమాడుటయందును, గుఱ్ఱములను పందెములు వేసి పరుగెత్తించుటయందును కాలయాపనము సేయువాఁడు,



భోగారాధనపరుఁడు మహాసామ్రాజ్య ప్రజల నెట్లు స్వాధీన మందు సుస్థిరముగా నుంచఁగలిగెను!" పిట్టుగారు మందహాస మొనరించి, "మీ రామాంత్రికశిఖామణి మంత్ర దండ బల మెఱుంగరు!" అనిపలికెను.

1783. వ. సంవత్సరము నవంబరు నెలలో పార్లమెంటు సభకూడెను. సభ్యులొక తీర్మాన మునపాదించిరి; భారత భూమియాంగ్లేయుల పాలనము క్రిందనుండిన రాజ్యాధికారము ఈస్టిండియా కంపెనీవారినుండి తప్పింపవలయును; పార్లమెంటు వారిచే నియమింపఁబడిన ఏఁడుగురు అధికారులు సమాన స్వామ్యములతో నా దేశమును బాలింపవలయును; రాజుగారిష్టము వచ్చినప్పుడు వారలను తొలఁగింప వలనుపడదు. ఫాక్సు గారి ప్రాణమిత్రుఁడు ఎర్లసిట్జి విలియమ్‌గా రాబోర్డున కధ్యక్షులుగా నుండవలయును; నార్తుగారి జ్యేష్ఠపుత్రుఁడాయేఁడుగురు అధికారులలో నొకఁడుగా నుండవలయును. పై తీర్మానమంగీకరింపఁబడునేని ఫాక్సుగారి యధికార మపారమగును. ఆతీర్మాన మంగీకరించు వారందఱును తనశత్రుగణములోఁ జేరినవారని జార్జిప్రభువు కోపగించెను; గానిహౌసు సాఫ్ లాడ్సులో నయ్యది యంగీకరింపఁ బడియెను. హౌసుసాఫ్‌లాడ్సు వారంగీకరించుటకు వెనుదీసిరి. రాజాగ్రహమునకు లోనగుట వారికిష్టములేదు. వారంద రాతీర్మానమును నిరాకరించిరి. ఫాక్సు, నార్తుగార్లను వారివారి యుద్యోగములనుండి తొలఁగించిరి. పిట్టు గారు

ప్రథమ కోశాధ్యక్షుఁడుగను, ఛాన్సలర్ ఆఫ్ ఎక్స్చెకర్‌గను నియోగింపఁ బడియెను. ఆదినములందు, సంవత్సరమునకు మూఁడువేల పౌనులు రాబడిగల యుద్యోగమొకటి ఖాళీ వచ్చెను. ఆయుద్యోగమున నేరికైనను నేర్పఱచుటకు పిట్టు గారికధికారముగలదు. అతఁడే యాయుద్యోగమును గ్రహించి యుండునేని ప్రజలాతని నించుకేనియుఁ దూలనాడి యుండరు గాని యామహాపురుషుఁ డట్లొనరింపలేదు. తనజనకుని యనుచరుఁడును, ముక్కాలి ముసలియనగు 'కర్నల్ బారీ' గారి నాయుద్యోగమున నియోగించెను. ఆకారణమున రాకింగ్ హామ్ గారు 'బారీ' నిమిత్త మేర్పఱచిన యుపకార వేతనము ప్రజాహితమునకు వినియోగింపఁ బడియెను. నౌకాదళ వ్యవహారములను గూర్చియు, వర్తకవ్యాపార నిర్వహణమును గూర్చియు, ఆహారపదార్థ నిర్ణయమును గూర్చియు, సంధివిషయములను గూర్చియు, శత్రుభంజనమును గూర్చియు, ఆదాయ వ్యయ క్రమములను గూర్చియు నెంతయు సామర్థ్యముతో వాదప్రతివాదములు సలుపవచ్చును అని కొందఱు మెల్లనపలుకవచ్చును; కొందఱు మిన్నుముట్ట తత్కౌశలమును బ్రసంశింపవచ్చును; గాని మంత్రియగువాఁడు స్వలాభమునకై ధనాశాపీడితుఁడగునేని ప్రజలందఱు నేకగ్రీవముగా నాతనిని దూషింతురు. అసూయభావమునఁ జూతురు. వత్సరమునకు మూఁడువేల పౌనుల రాబడిగల యుద్యోగము కరతలామలకమైనను



పిట్టుగా రంగీకరింపలేదు; మూఁడువందల పౌనులతో సంతృప్తి వహించెను. సన్మార్గవర్తనునకు శుభంబు చేకూరును. అప్పు తలమీఁద బరువుగాఁ జేరినను, లక్షలకొలఁది ప్రజలాతని హస్తగతులగుచుండినను, దేశమునఁగల భూస్వాములును, ధనాధిపతులును, ఆతని కరుణాప్రసాదము నర్థించుచుండినను, ఆతఁడు ధనాశబూనలేదు. ఆతని గర్భశత్రువగువాఁడు కూడ యాతనిని ధనాశాపీడితుఁడైన దూషింప సాహసింపడు!

ఆతఁ డిరువదిమైదు వత్సరముల వాఁడగునాటికి రాజదేవేంద్రుని యవ్యాజానురాగమే కాక, పార్లమెంటు సభికుల నిర్మలాభిమానమును, ప్రజల ప్రేమాధిక్యమును వడయనేర్చెను ఆంగ్లభూమియందు జన్మించిన మంత్రిపుంగవుల కీతఁడు శిరోభూషణమని యెల్లరును తలంచిరి; వచించిరి.

చిన్నతనమాదిగా నాతఁడు పార్లమెంటు సభల నెట్లు వర్తింపవలయునో తెలిసికొన నువ్విళులూరుచుండెను. చట్టములు నిర్మించుటయందును, సంధికార్యములు నడపుటయందును, నౌకాదళములను, సేనాసేవనమును సమయోచితముగా భవిష్యత్సుభానుభవమునకై నిర్మించుట యందును, ఉద్రేకభావోన్మత్తులై, విద్రోహానలమును బ్రజ్వలింపఁ జేయువారి యుద్యమములు నాశనమొందింప నపారవాహినీ సముదయమును బంపుటయందును, పిట్టుగారు జూపిన కార్యనిర్మాణశక్తి దేశాభిమానము, స్వార్థత్యాగము, అద్వితీయములు. కాని

యొకానొక విషయమునుగూర్చి పార్లమెంటు సభికులను నమ్మించుటయం దాతనికిఁగల సామర్థ్యము నిరుపమానము వెన్నతోఁబెట్టినది. ఆతఁ డుపన్యాసములొసఁగు సమయములందు గృహమున నెమ్మదిగా యోజించి, క్రోడీకరణ పత్రమును గైకొని యెన్నఁడును వచ్చియుండలేదు; ఒకమాటైనను సరియగు పదమునకాఁగువాఁడు కాఁడు; పునరుక్తిదోషమును పరాకునకైనఁ జేయఁడు; స్పష్టముగా, సభ్యులకు బోధపడునటుల సుధారసధారలు జాలువార నుపన్యసించును. ఏవిషయమును గూర్చి విపులముగా మాటాడవలయునో, యేవిషయమును గూర్చి శ్లేషార్థ ముపయోగింప వలయునో యాతఁడెఱుంగును. తనయర్థమును సభ్యుల కెఱింగింప వలయునని యాతని యభిమతమేని తప్పక యట్లొనరించును. ఆతని యుపన్యాసములం దయుక్తాంశములుగాని, యప్రస్తుతాంశములు గాని కాగడా పెట్టివెదకినను గావరావు; ఆతఁడొక్కవిషయమైనను మఱచువాఁడుకాఁడు. తాను జెప్పవలసిన విషయములన్నియు సమగ్రముగా వచించువాఁడు; మిక్కిలి స్వల్పాంశములు, తారీఖులు, ఆదాయవ్యయ మొత్తములు; మున్నగునవి యాతఁడుజ్ఞాపకముంచుకొనువాఁడు. అర్థశాస్త్రీయ విషయములను పూసగ్రుచ్చినటుల యాతఁడు సభికులమనోగత మగురీతి చెప్పువాఁడు. ఒకసమయమునఁ దన యర్థమును సభ్యుల కెఱింగింప నిష్టములేనిచో నాతఁ డతి సామర్థ్యముతోఁ బలుకనేర్చువాఁ



డగుట నాతఁడు వచించునది మిక్కిలి తక్కువమైనను, ఎంతయో చెప్పినటుల వినువారు దలంతురు! పార్లమెంటు సభలకు రాజుగారు రాకుండినను, మంత్రి, రాజుగారి స్థలమున నుపన్యసింపవలయును. అట్లుపన్యసించు వేళలందు స్వేచ్ఛగామాటాడుటకు వీలుండదు; కడుజాగరూకతతో మెలఁగవలయును; లేనినాఁడు ప్రమాదము జేకూరు. పిట్టుగారికి రాజుగారి తరఫున నుపన్యాస మొసంగు సమయములందుఁ గూడ గృహమున నాలోచనముచేసి వచ్చువాడుక లేదు. అట్లయ్యు నాతఁడు వచించునది కరంబు శ్లాఘనీయమై, నిర్దుష్టమై, విస్పష్టమై యుండెడిది. మహావక్తయగు వాని ముఖ్యలక్షణ మిదియే కదా?

అన్నదమ్ముల యందును, తక్కుంగల బంధుమిత్రులయందును, గురువులందును ఆతఁడు జూపిన ప్రేమయు వినయమున కడుంగడు శ్లాఘాపాత్రలు. వారును ఆతని నత్యంతానురాగమున మన్నించువారు; పిట్టుఁబోలు సదయహృదయుఁడు పుట్టంబోఁడని వారు భావించిరి.

లాటినుగ్రీకు భాషావేత్తయు, సహజ బుద్ధిశాలియు, మహావక్తయునగు వాఁడు గ్రంథకర్తలను బ్రోత్సహించుటకు మొదటివాఁడుగా నుండునని యొకతలంపు కలుగును; గాని యాతఁడు కలనైన నట్లొనరింపలేదు. తనపక్షము వారిలోఁ జేరిన కవిశిఖామణుల నాతఁడాదరింపలేదు. కవిగాయకులును

దేశచరిత్రకారులును, తన్మూలగల శాస్త్రజ్ఞులును, రాజపోషణము వడయరాదు. అట్లువడయుదురేని దేశమునకును సారస్వతమునకును హానిగలుగును, అని యాతని దృఢనమ్మకము. కవిత్వము చెప్పు ప్రతివానికిని రాజపోషణము లభించునేని నిజ,ముగా పిట్టుగారి యభిప్రాయము స్థిరపడును. విశేష గ్రంథావలోకనములేక, దినమునకొక పద్యపాదమునల్ల నేర్చువారుకూడ రాజపోషణమున కాశించుదురేని యది కడు శోచనీయముగా నుండును; గాని దేశోన్నతికై, సారస్వతాభివృద్ధికై కంకణముఁ గట్టుకొనిన కవిపుంగవులను రాజులు పోషించినఁ గాని మేఘములచాటున నక్షత్రములవలె వారభ్యుదయము నొందఁజాలరు; ప్రకాశింపఁజాలరు. అట్టికవిసార్వభౌములను గ్రహించి, సంరక్షించు భారము రాజులయందున్నది. ఆకాలమున వాఙ్మయము నుద్ధరించుటకై పుట్టిన మహానుభావులెందఱో యుండిరి. ఒకానొక పరిషత్వేత్త బీదవాఁడై 'మార్నింగ్ క్రానికిల్' సంపాదకుని యనుగ్రహమున జీవనోపాయము గ్రహించుచుండెను. దేశచరిత్రకారులకు గుత్తిమైన యొకానొక మహానుభావుఁడు స్వదేశమున వసతిలేక, దారిద్ర్య దేవత బీడింప, నవనతవదనుఁడై 'లేక్ లేమాన్' తీరమునఁ దన గ్రంథమును బూర్తిచేసెను. జరాభరమునకుఁ దోడుదారిద్ర్య భరము గూడ తోడ్పడ, శబ్దార్థరచనా విశారదుఁడును, కవిజీవితములను బహుప్రయాసముల కోర్చి విరచించిన మతిమంతుఁడును, కరుణాభరణుఁడునగు 'జాన్సన్' ఐదారువందల పౌనులనొసంగిన ఇటలీదేశమునకుఁ బోయి ప్రశాంతహృదయముతో జీవయాత్ర ముగింతునని రాజుగారి కెఱింగించెను. ఒక కాసైన నాతని కొసంగుటకు వలనుపడదని పిట్టు కఠినోత్తరవుచేసెను. జాన్సన్ మరణానంతరము కొలఁదిదినములలో 'టాస్కు' అను పద్యకావ్యమొకటి వెలువడెను. ఆకృతికర్త, మహానుభావుఁడు కౌపరు. ఆగ్రంథమందు ఛాదమ్‌గారి సుకృతములు నిండారు యభిమానముతో వర్ణింపఁబడియెను. పిట్టు తద్గ్రంథమామూలాగ్రముఁ జదివి కవిహృదయమును అభినందించెను, గాని యొకకాసైన నాతని కొసంగనీయలేదు. రాష్ట్రాదాయములోఁ గవిశ్రేష్ఠుల కొసంగుట కంగీకరింపకుండినను మతముల రాబడియైన వారల రక్షణార్థము వినియోగించి యుండిన మిక్కిలి ప్రశంసనీయముగా నుండియుండును. పిట్టుగారందులకుఁగూడ అంగీకరింపఁజాలరైరి. చిత్రకళాభిమాన మాతని కిసుమంతేనియులేదు. ఆతఁడమాత్యుఁడుగా నుండుకాలమున శిల్పవిద్యావిదు లుపవాసవ్రత మవలంబించిరి; రమ్యహర్మ్యములుగాని, కళాభరణములగు కట్టడములు గాని యాతని యధికారసమయమునఁ గట్టఁబడలేదు. శిల్పికళాదక్షులనియోగించుట యవసరమగునపుడు తగు మాత్ర మాకళ తెలిసినవారిని నియోగించెను; గాని వారికి జీతములొసంగవలసి వచ్చినప్పుడాతఁడు చాల త్రిప్పలు పెట్టెను. ఒకానొకశిల్పి యాతఁడెన్నటికిని జీత

మోసంగమికి భయపడి రాజుగారికి విన్నవించుకొనియెను; న్యాయమునువడసెను. రాజవిద్యావిశారదుఁడును, సామ్రాజ్య రక్షణాదక్షుఁడును, సుప్రసిద్ధదేశభక్తుఁడును, విద్యాభిమానియు నగు వాఁడు కవికుల చక్రవర్తులను, శిల్పకళాపారీణులను, చరిత్రకారులను ప్రోత్సహింప కుండుటయేకాక, యసూయ జానమున వారిం జూచుట మిక్కిలి యాశ్చర్యముఁ గొల్పక పోదు.

పందొమ్మిది వత్సరము లాతఁడు నిరంకుశముగా నధి కారముద్రవహించి పార్లమెంటు సభలకుఁ బ్రాణసమానుఁడై యుండెను. ఆదినములందు ఇంగ్లాండుదేశ ధనమువస్తుకనకవిస్తారితమై, వర్ధిల్లెను; పరిశ్రమలువిరివిగా వ్యాపించెను; కోశాగారమున ధనమువెల్లివిరిసెను; దేశమున ప్రశాంత భావము నెలకొనియెను.

తృతీయజార్జి మంత్రుల నమ్మువాఁడుకాడు. వారియుద్దేశములాతనికి వెగటుగాఁ దోఁచుచుండినవి. ఆతనిచిత్తమునను సరించువారల నాతఁడనురాగముతో మన్నించువాఁడు; పిట్టుగారధికారముద్ర వహించిన నాఁటఁగోలె రాజేశ్వరుఁడు తనవర్తనమును మార్చుకొనవలసి వచ్చెను. పిట్టుగారియం దాతనికి దృఢనమ్మకముజనించెను. ఆకారణమున నానాఁటి కారాజపురంధరుఁడు సన్మార్గమును గ్రహించి యందునిర్వక్రముగా గమనింపగడంగెను. ప్రజలందఱును దమయేలిక ఋజువర్త



నమునకును, సదయహృదయమునకును, మతాభిమానమునకును, మిక్కిలి యుప్పొంగిరి; పిట్టుగారి నెంతయు శ్లాఘించిరి. రాజుగారు ప్రాతఃకాలముననే మెలకువఁ బొందఁగడంగిరి; వేళకుచితరీతి భుజింపఁబూనిరి; మతమున కరుగుట కంతరాయములను గలిగించుకొనరైరి; భార్యయం దనుకూలభావ మూనిరి. ఆయురారోగ్య సంపన్నుఁడై వర్ధిల్లుగాతయని ప్రజలాతనిం గూర్చి పరమాత్మునిఁ బ్రార్థింపఁ దొడంగిరి.

1788. వ. సంవత్సరమున జార్జిగారికి పిచ్చివ్యాధి పొడసూపెను. ప్రజలంద అమితవిచారమునకుఁ బాల్పడిరి. ఆతని కుమారుఁడు ' జార్జి ప్రిన్సాఫ్ వేల్సు ' వివేకవిహీనుఁడు; మరియును దుర్మార్గావలంబి. యువరాజుగారిని రాజప్రతినిధిగా నియమించుట ఆంగ్లన్యాయశాస్త్ర సమ్మతమని పెక్కండ్రు వచించిరి. పిట్టుగారందుల కంగీకరించిరి; గాని యాప్రతినిధికెట్టి స్వామ్యము లొసంగవలయును, అనువిషయమును గూర్చి వాదోపవాదములు సలిపెను. కడకు పిట్టుగారి తీర్మానమునిలచెను; రాజప్రతినిధిగారి యధికారము కొంతవఱకే బలమును గలిగియుండునని యాతఁడు తీర్మానించెను; గాని మూఁడుమాసములతరువాత రాజుగా రారోగ్యస్నాన మొనరించిరి. ప్రతినిధిని నియమింపవలసిన యవసరములేకపోయెను. ప్రజల యానందము మిన్నుముట్టెను. పిట్టుగారియందు వారికి గౌరవాధిక్యత బొడసూపెను. ఆతఁ డిప్పుడు ఇరువదితొమ్మిదేండ్ల

వాఁడు. బీదవాఁడైనను, ధనాశలేనివాఁడు. లండనునగరమున నెందఱో శ్రీమంతులు హృదయపూర్వకముగా నాతనికి ధన మొసంగుటకు సన్నద్ధులై యుండిరి; గాని యాతని రాజసము, ఆత్మగౌరవము బలమైనవగుట ఆతనియందు ధనాశజనింపఁజేయ లేదు.

1788. వ. సంవత్సరమున సంతోషప్రదమును, ప్రపంచ చరిత్రమున నాచంద్రతారార్కము మిక్కిలి కొనియాడఁదగి నదియునగు విశేషమొండుజరిగెను. పిట్టుగారి పవిత్రనామము దానితోఁగూడియున్నది. బంధకవ్రాతమువలనఁ గలుగు దుర వస్థలకుఁ గన్నీరు కాల్వలై పార విలపించిన విల్బర్ ఫోర్సుగారు దానినాపుటకై యొకతీర్మానము నుపపాదించిరి. వ్యాధి పీడితుఁడగుట నాతఁడు సమయమునకు రాఁజాలఁడయ్యెను. ఆకారణమున నాతని యభిప్రాయము నిరుత్సాహపూరితము కాలేదు. పిట్టుగారు కార్యోత్సాహము దీపింపబంధక వ్రాతము విరామము జెందవలయునని వాదించిరి. జాలిమొఱఁగని కొంద ఱనుమతింపకుండినను, బంధకవ్రాతము నాపఁబడవలయునని చట్టమును తీర్మానించిరి. పిట్టుగారి సానుభూతి సంస్తవనీయము!

పిట్టుగారికి రణతంత్రాభిలాష మిక్కిలితక్కువ. ఆకార ణమున నాతని చరిత్రోత్తరభాగము మిక్కిలి విచారకర ముగాఁ బరిణమించెను.

1783. వ. సంవత్సరమునుండి 1792. వ. సంవత్సరము



వఱకు ప్రజలచే నభినందింపఁబడిన పిట్టు తదనంతర మా ప్రజల కోపములకు గుఱియయ్యెను. యుద్ధనిర్వహణమున కాతఁడు తగినవాఁడుకాఁడు. రణోత్సాహ మాతనియందించుకైనఁ బొడసూపియుండలేదు. శాంతిరాహిత్యమైన దేశములు బల హీనములై నశించునని యాతని నమ్మకము; గాని కాలాను గుణముగా వర్తింపనేరకున్న అపజయము సిద్ధించును. ఆదినము లందు రణతంత్రవిశారదుని యాధిపత్య మవసరమయ్యెను; “ పరాసుదేశమున మానవులకు సహజసిద్ధములైన సౌభ్రాతృ త్వము, స్వాతంత్ర్యయము, సమానత్వము సిద్ధాంతములుగ స్థాపింపఁబడినవి. ” భయంకరమగు రుధిరవిప్లవము సంభవిం చెను. ఫ్రాన్సురాజ్యాధికారులు దేశసంపదలను ప్రజాప్రాణము లను తృణప్రాయముగా వినియోగించిరి. యూరపుఖండాధి పత్యమును బడయుట కుపక్రమించిరి. “ కష్టతప్తులైన ప్రజ లందు పుటముపెట్టిన బంగారము నందువలె నూతనప్రకాశ ముదయించినది. ఆప్రకాశమునకు ఫలము ప్రజాస్వామ్యత్వ యుగారంభము. ”

ఏకఖండాధిపత్యమునకుఁ బేరాసవహించి దేశమును, మహాదుఃఖపరంపరలఁ ద్రోసిన ఫ్రెంచివారి యుద్దేశమును, కార్యక్రమమును పిట్టు గ్రహింపఁజాలఁడయ్యె. త్వరలో సమ రము ముగియునని యభిప్రాయము పడెను; గాని యాతఁడను కొనినటుల జరుగలేదు. ఫ్రెంచివారి దురంతములు నానాటి

కసహ్యములు కాఁజొచ్చెను. ఆంగ్లేయులు వీరవ్రతాభిమానము వెల్లివిరియ భోగవిముఖులై పరాసుల భంజింపఁ గంకణముగట్టుకొనిరి. పిట్టుగారికి యుద్ధమున జోక్యము గలిగించుకొన నిష్టము లేదు. ప్రజాసమూహ ముత్సాహభరితమై శాత్రవ విధ్వంసమునకుఁ బూనుటవలన నాతఁడు వారల నడ్డఁజాలకపోయెను.

యుద్ధము చాలదినముల వఱకును జరిగెను. ఆసంగ్రామేతిహాసమున నాంగ్లులకు విజయ మించుకైనఁ గలుగలేదు. పిట్టుగారి సమరనిరుత్సాహమే ప్రబలకారణము. ఆతఁడు విజయయాత్ర కుపక్రమించుటయే లేదు. నౌకాదళము మాత్రము వెనుదీయక బ్రిటిష్‌పతాకమును సంరక్షింపఁగలిగెను.

పిట్టుగారు కడపటి వత్సరములు గమనార్హములు. ఐర్లండు దేశీయుల హితవును గోరిన స్వల్పమంత్రివర్గములో నీతఁ డగ్రగణ్యుఁడు. ఐర్లండు దేశమున నివాసము లేర్పఱచుకొనిన రోమన్ కాథలిక్ మతావలంబులు దుర్భరములగు నిర్బంధములకులోనై యుండిరి; వారు రాజకీయోద్యోగములు వడయరాదు, సేనలయందుఁ జేరరాదు. పిట్టుగారు కరుణాభరణులై ఐర్లండున కుపకార మొనరింపవలయునని తలంచెను. ఐర్లండు దేశమును ఇంగ్లాండుతోఁ గలపవలయును; రోమన్ కాథలిక్ ప్రజల దురవస్థలను తొలఁగింపవలయును." అని యాతఁడు పట్టుదలతో వాదించెను. రాజుగారందుల కంగీకరింపలేదు. అంగీకరించిన పాపము సంభవించునని భయమును సూచించిరి;



పిట్టుగారు జవాబు చెప్పుటకు సమర్థులేగాని, ఐర్లండు విషయమును గూర్చి ప్రసంగించు సమయములందు జార్జి గారు కోపోద్దీపితులై, జ్వరబాధితులగుచుండిరి. ఇంతియకాదు; ఆతనికి వెఱ్ఱికూడ యెత్తుచుండెను; పిట్టుగారు రాజేంద్రుని యందుఁగల నిరుపమానాభిమానమున తమ జీవితకాలమందు ఐర్లండును గూర్చి ప్రసంశింపఁజాలరైరి. తరువాత కొంతకాలమాతఁడు రాజ్యాంగవిషయము లందు జోక్యము గలిగించుకొనలేదు. ఐరోపాయుద్ధము కొంఁదికాలము మాఁపోయెను; గాని నెపోలియన్ మహావీరుని వీరవ్రతము సమాప్తమొందలేదు. ఇంగ్లాండు దేశమును ముంచివేయవలయునని ప్రయత్నము సేయసాగెను; గాని యాతని యభిమత మీడేరలేదు. ఆంగ్లవీరుల ప్రతాపాగ్ని మాతని కొకింత భయముగలిగించెను.

పిట్టుగారు మరల మంత్రిత్వ మంగీకరించిరి. ప్రతినెలలో నేదియో యొక యపజయము వినవచ్చుచుండెను. దానికితోఁడాతని యాప్తమిత్రులెందఱో మరణించిరి. ఆతఁడు వ్యాధిగ్రస్తుఁడయ్యెను. ఫాక్సుగారియందు రాజేంద్రునకుఁగల దురభిమానమును తొలఁగింపవలయునని యాతఁడు చాల ప్రయత్నించెను. ఆతని ప్రయత్నములు కొంతవఱకు ఫలించెను.

నానాఁటికాతని యారోగ్యము క్షీణింపసాగెను. రాత్రులందాతఁడు సుఖనిద్ర జెందలేదు; ఆహారము రుచింపదయ్యె. ఆతని విశాలముఖఫలకంబున నలజడి విస్పష్టముగా లిఖింపఁ

బడియుండెను. కష్టదశయందుండినను దేశభక్తి యాతనిని విడనాడలేదు. ఫ్రెంచివారి దారుణోద్యమములను నాశనమొందింపఁ దలంచి ప్రయత్నములు సేయఁగడంగెను; గాని నెపోలియన్ బలవంతుఁడే కాక బుద్ధివిశాలుఁడు. పిట్టుగారి ప్రయత్నములాతనిని నిరోధింపఁ జాలవయ్యె.

యుద్ధవార్తలు వినవచ్చెను; ఆస్ట్రియనులు 'అల్ము' అనుచోట జయింపఁబడిరి. పిట్టు నమ్మలేదు. 'కల్పితగాద!' యనిపలికెను. ఆమఱునాఁడు డచ్చివారి యపజయవార్త వినవచ్చెను. పిట్టుగారి హృదయము భేదించెను. విచారము పొంగిపొరలెను; మరణము ముఖమున ముద్రవేసినటుల దోఁచెను. నాలుగుదినముల తరువాత ట్రఫాల్గర్ యుద్ధమున నాంగ్లులు జయమొందిన శుభవార్త వచ్చెను. ఆతఁడించుక శాంతించెను. రెండుదినముల తరువాత లార్డు మేయర్ గారి విజయము వినవచ్చెను. పిట్టుసంతోషించెను. "ఇంగ్లాండు దేశము తన్నుదాఁ గాపాడుకొనుటయే కాక యూరోపుదేశమును రక్షించుఁగాక!" అని యాతఁడు వచించెను.

వ్యాధితీవ్రముగాఁ బీడింపఁజొచ్చెను. నెపోలియన్ గారి విజయములు ప్రారంభముగాయెను. మొరేవియా యుద్ధమున ఫ్రెంచివారు జయమువడసిరి. నెపోలియన్ మహాశయుని జవసత్త్వములు విజృంభించెను. 'ఆస్టర్లిట్జి' యుద్ధమున పరాసువారు విజయదుందుభి మ్రోగించిన సమయమున, పిట్టుగారు, 



తద్దుర్వార్త నాలించి "హా! మాతృదేశమా!" యనిజాలిగదుర, తన హృత్ప్రదేశమున నిబిడీకృతమై వెలుగుచుండిన దేశభక్తి పైకేగుదేర, యార్తనాదమొనరించిరి. ఆమహాపురుషుఁడు, ఆంగ్లమాత కంఠభూషణము, ప్రజాపాలిటి వేల్పుటావు, రాజకార్యపరతంత్రుఁడు, ధర్మమార్గానువర్తి, వివేకధనుఁడు, యశోవిశాలుఁడు 1806. వ సంవత్సరము జనవరి తే **23** దిని ఇహలోకము బాసిపోయెను! మరణించునాఁటికాతనికి నలుబదియేఁడేండ్లు నిండినవి. ఆతఁడస్తమించిన దుర్దినమున నాంగ్లభూమియందు బాష్పవృష్టి కురిసెను.



# ఆంగ్ల దేశ సేవకులు

## నెపోలియన్



నెపోలియన్ మహావీరుఁడు 1769. వ. సంవత్సరము ఆగష్టు తే 15 దిని జన్మించెను. ఆతని తండ్రి చార్లస్ నెపోలియన్ 1746. వ. సంవత్సరమున జన్మించెను. ఆతఁడు సంఘమందు గౌరవము సంపాదించినను, ధనవంతుఁడు కాఁడు; ఒకబీద న్యాయవాదిగా నుండెను. యౌవనదశయం దాతఁడొక బీద బాలికను ప్రేమించెను; ఆమె కడుంగడు సౌందర్యవంతురాలు. ఆతఁడామెను కాలక్రమమునఁ బెండ్లియాడెను. ఆదంపతులకుఁ బదుముగ్గురు బిడ్డలుగలిగిరి. అందు పెరిగి పెద్దవారై యెనమండుగురే జీవించిరి. పందొనిమిదవ శతాబ్దమున నిర్వక్రపరాక్రమమేపార, నెల్లరాజుల జయించి, సార్వభౌముఁడై, తనసోదరులలో మువ్వురను సింహాసనాసీనులను జేసిన మహాపురుఁడు ఛార్లస్‌గారి ద్వితీయపుత్త్రుఁడు నెపోలియన్. ఆతని యప్రతిమాన బుద్ధివైభవమునకుఁ దండ్రి కారణముకాఁడు. లిటిజయా రామోలినోయను పేరంబరఁగు నాతని జనని, కాంతామతల్లి,



యాతని భావియౌన్నత్యమునకు హేతువయ్యెను. ఆమె సద్గుణనికురంబ; బుద్ధిమతి; నిశ్చితార్థసంధాయిని; దీర్ఘదర్శి. నెపోలియన్ కూడ ఆగుణములను గలిగియుండెను. ఆతని కామె యందు మిక్కిలి యనురాగము, గౌరవము, భక్తి నెలకొని యుండెను. కష్టదశలందు దూరదృష్టిగల యామెహితవనుసరించి యాతఁడు మెలఁగుచుండెను.

ఆతని బాల్యకాలమున మహాద్భుతములు కొన్నిఘటిల్లెను. ఆతని స్వభావోన్మీలనమున కవియును గారణమయ్యెను. కార్సికాయును, జెనోఆయును నలుబది వత్సరములనుండి యన్యోన్యకలహముల వెనుదీయవయ్యె; విసుగుజెందవయ్యె. కార్సికాద్వీపస్థులు 'పయోలీ' యనువీరపురుషుని, యధికారము క్రింద మిక్కిలిపేరువడసిరి; గాని ఫ్రెంచివారు బలకపట సమ్మేళనమున వారినపజయ మొందించిరి. నెపోలియన్ తన జీవితకాలమున నెన్నడును, ఆయుద్ధవ్యవస్థలను మఱువలేదు. ఇరువదియేండ్ల వాఁడైనపు డాతఁడు పయోలిగారి కిట్లువ్రాసెను. "మాతృభూమి యస్తమించుచుండిన సమయమున నేను జన్మించితిని; మృత్యుముఖమునఁ బడువారి యేడ్పులును, పరిభవింపఁబడు వారి యార్తనాదములును, నిస్పృహఁజెందువారి యశ్రుధారలును నాయుయ్యెలను జుట్టియుండెను." ఆతనికి కార్సికాయందు నిరుపమానాభిమానము గలదు; ఫ్రెంచివారి వేషభాషలాతని కయిష్టముగాఁ దోఁచెను.

ఆతఁడు బాల్యకాలముననే సర్వసంగతులందును మిక్కిలి పట్టుదల వహించుచుండెను. అవిధేయత, ప్రథమకోపము ఆతని కా దినములందుండెనట. ఇందెంత నిజమున్నను, మొక్కవోని మనోబలము మాత్ర మాతనియందు నిశ్చయముగా వర్ధిల్లెను. బోరుబోన్ చక్రవర్తులు బ్రయనీనగరమున బాలభటులు యథావిధిగా శిక్షవడయుటకు యుద్ధవ్యవసాయ పాఠశాలనొండు నిర్మించిరి. ఆపాఠశాలయందు నెపోలియన్ 1779. వ. సంవత్సరము మొదలు 1784. వ. సంవత్సరము వఱకు తద్విద్యాభ్యాస మొనరించెను. ఆదినములం దాతఁడు ఫ్రెంచి భాష బాగుగా నేర్చి యుండలేదు; విశేషించి కార్సికా ద్వీపస్థుఁడు. ఆ కారణమున సహాధ్యాయు లాతనిని పరిహాసించియు, నసూయభావముతోఁ జూచియు నాతని యాగ్రహమునకుఁ బాత్రులగుచుండిరి. ఆతఁడు స్నేహితులందుఁ గూడ ముభావముతోఁ వర్తించుచుండెను; గాని యాతని భావి యౌన్నత్యమును సూచించు సంగతులు లేకపోలేదు. గణిత శాస్త్రమం దాతఁ డద్వితీయుడుగా నుండెను. మిక్కిలిపట్టుదలతో దేశచరిత్రముకూడ చదివెను. ప్లూటార్కు గారి 'జీవితములు' సీజర్ కృతమగు "కమెంటరీస్," ఆతని యభిమానధనములు రణరంగములందు యోధాగ్రేసరులు వర్తించిన విధము, పరాక్రమనిధుల సమర సముచిత వ్యాపారము లాతని మనః ప్రదేశమున వీరరసము జనింపఁజేయుచుండెను. గ్రీకు లాటిన్





భాషలయం దాతఁడు ప్రవీణుఁడుకాఁడు. ఫ్రెంచిభాషయం దాతఁ డెంతయో పాండిత్యమార్జించెను. మిక్కిలి బుద్ధిమంతు డగుట చదివిన విషయములన్నియు నాతఁడు జ్ఞాపకముంచుకొనఁ గలిగెను.

ఆతఁడు మితభాషి; ఏకాంతవిహారము గోరువాఁడు; చంచలుఁడు; రాజసముగలవాఁడు స్వార్థపరుఁడు; ఆతని కోరికల కంతములేదు: సంభాషణ సమయములందు సదుత్తరములు సత్వరము నొసంగ నేర్చినవాఁడు; గాని యీగుణములు కాలక్రమమున నాతనియందు మార్పుజెందెను;

బ్రియనీ నగరమునుండి నెపోలియన్ పారిసునకుఁబోయెను. 1785. వ. సంవత్సరము వఱ కాతఁ డాపట్టణముననే విద్యాభ్యాస మొనరించెను. ఆకాలమున నాతఁడు "బాలభటులు సుఖజీవనము" అనువిషయముపై నొక యుపన్యాస మొసంగెను. తరువాత ఫ్రెంచిదేశమున నందందుఁగల యుద్ధవ్యవసాయపాఠశాలలందు నైదు వత్సరములు గడిపెను.

ఆతఁడు యౌవన దశారంభమున సుప్రసిద్ధ యుద్ధవ్యవసాయియాయెను. సంగ్రామవిషయములం దపరిమితజ్ఞానము గణించెను. యుద్ధవ్యవసాయేతిహాసము నామూలాగ్ర మాతఁడు మిక్కిలి శ్రద్ధతోఁ జదివి గ్రహించెను. దేశపటముల సహాయమున నెచ్చట యేదుర్గమున్నదో, యేకోటయెచ్చటనున్నదో కూడ నేర్వఁగలిగెను. ఆతఁడు విద్యార్థియుఁడగు సైనికుఁడు.

ఇంతియకాదు. న్యాయశాస్త్ర మందునను, తత్త్వశాస్త్రమందునను, మతవిషయికములందునను, ఆతనికిఁ బరిచయముండెను. రాజవిద్య నాతఁడు మిక్కిలి ప్రయాసమునకోర్చి నేర్చెను. తత్కారణమున నెపోలియన్ అమిత్రఘాతకుఁడే కాక చక్రవర్తి కూడ యాయెను.

జనకుని మరణానంతర మాతని తల్లియే గృహమును సుస్థిరముగా నుంచెను. అప్పుడప్పుడు గురువుల సెలవువడసి యాతఁడు కార్సికాద్వీపమునకుఁ బోవుచుండువాఁడు. ఆద్వీపమున నిప్పటికి నొకరమణీయ రహస్య ప్రదేశమును జూచుటకు బాటసారు లభిలషింతురు. తత్ప్రదేశమున నాతఁడు తద్ద్వీపమనుభవించిన భంగపాట్లన్నియు విచారరస మొలుకఁ బేర్కొనియెను.

కార్సికాద్వీపము ఫ్రెంచివారి యాధిపత్యము క్రిందనుండినను, పంచాయతీ కలిగియుండెను. పదచ్యుతుఁడైన 'పయోలి' పునరభిషిక్తుఁడయ్యెను. ఆతని దర్శనార్థము నెపోలియన్ వెడలెను. దేశాభిమాని పయోలి నిండారుయభిమానముతో నాతనిని సంభావించెను. భూచక్రమున జన్మించిన మహాపురుషగణమునకు శిరోభూషణముగా నాతనిని భావించెను. 'నేష్నల్ గార్డు' న కధిపతికావలయునని నెపోలియన్ వాంఛించెను; పట్టుదలతోఁ బ్రయత్నించెను. ఆపదవికి నర్హుల నెన్నుకొను సమయమాసన్నమగుడు ఫ్రెంచి మహాశయుఁ డొకఁడు నెపోలి



యన్ గారి నెన్నుకొనుట కిష్టపడలేదు. నెపోలియన్ ఆతనిని మంచిమాటలాడి బంధించెను. ఉన్నతపదవి వడయుట కాశించి యాతఁడు పాఠశాల కరుగఁడయ్యె ఆకారణమున నాతని పేరు తీసివేయఁబడెను. 1792. వ. సంవత్సరమున నాతఁడు పరాసు నగరమునఁ గర్తవ్య మూహింపనేరక, దారిద్ర్యభరమున కోర్వఁజాలక, స్థైర్యములేక, వసించెను. వర్తకము చేయవలయునని యనుకొనియెను.

ఫ్రెంచి చక్రవర్తుల వర్తనము ప్రజలమనోగతములఁ గోపాగ్ని రవుల్కొల్పెను. అధికారులు పన్నులు చెల్లింపనవసరములేదు; బీదవారలు పన్నులెన్నియో చెల్లింపవలయును; కోశాగారము నందొక దమ్మిడియైన లేదు; తినుటకులేక మలమలమాడుచు వాడవాడలఁ దిరుగు జీవచ్ఛవములు కూలికాశింపక యంత్రశాలలందును, గృహములందును, పనులు చేయవలయును, ప్రజాభివృద్ధికి తగిన విధమును పాలకు లనుసరింపలేదు ప్రజలష్టకష్టములొందిరి. ఆసంక్షోభము కారణమున ప్రజాస్వామ్యత్వము సుస్థిరత వహించెను. 'పదునారవ లూయీ' చక్రవర్తిగానుండెను. ఆతఁడు రాజదండనమున నర్హుఁడు కాఁడని ప్రజలు తలంచిరి. కఠినాత్ములై యాతనిని వధించిరి. ఆతని మిత్రులందఱును ప్రజల కోపాగ్నిలోఁబడి దగ్ధమైరి. ఫ్రెంచి ప్రభ్వాణి కూడ వారి దురాగ్రహమున నస్తమించెను! నెపోలియన్ ఈవిషాదాంతవిషయ మవలోకించెను; చక్రవర్తి బల

హీనతకసూయ వహించెను; పరాసువారి దురంతమునకు సాగ్రహమూనెను.

ఆసమయమున జర్మనులు ఫ్రెంచిరంగమునఁ బ్రత్యక్షమైరి. వారల నంతమొందింపఁ బ్రయత్నములు జరిగెను. నెపోలియన్ ప్రదర్శించిన బుద్ధి బాహు బలము లపరిమితములు.

ఫ్రెంచిదేశము రాజులేని రాజ్యమయ్యెను. రుధిరవిప్లవమున నెందఱో నిహతులైరి. పరాసుప్రజ యాందోళన మ్యూరోపాదేశమం దెల్లెడఁ బ్రాకెను. అన్యరాష్ట్రీయులు భయదాశ్చర్యమగ్నులైరి. కార్సికాద్వీపమున కా దావానలము ప్రాకలేదు. ఫ్రెంచిసార్వభౌముని దుర్మరణమునకు 'పయోలి' దుఃఖితాత్ముఁడయ్యెను. ఫ్రెంచిరాజ్యాంగమువారి దుర్వర్తనమున కాతఁడసూయగొనెను. ఆ కారణమున ఫ్రెంచివారాతనినడవడిక విచారణము సేయనెంచిరి. పయోలి ఇంగ్లాండువారి సహాయమపేక్షించెను. నెపోలియన్ ఫ్రెంచివారి యుద్దేశము లనుసరింప నిదివఱకే కంకణము గట్టుకొనియెను. అందువలన నాతఁడు పయోలిగారి విషయమున సహాయ మొనరింపఁజాలఁడయ్యె. పయోలి యాతనిని రాజద్రోహి యని నిరూపించెను. దేశభ్రష్టునొనరించెను. నెపోలియన్ మాతృదేశమున కెదురై నిల్చుటకాతని స్వార్థపరత్వ ముకారణమైనను, ఫ్రెంచివారి యుద్యోగమున నాతఁడు మెలఁగుటవలన నొండువిధమున



వర్తింపరాదని యెంచెను. మాతృభూమిని రణరంగముగా మార్పవలయునని యాతని యభిమతముకాదు. పయోలిగారి యందాతని కభావములేదు. ఫ్రెంచివారి జీతము వడయువాఁడగుట, వారిచే నియోగింపఁబడినవాఁడగుట, ఫ్రెంచివారి రక్షణార్థ మాతఁడు తన ప్రాణములనైన నర్పింప సన్నద్ధుఁడయ్యెను.

దేశమున నల్లకల్లోలము జనించెను. రాజ్యాంగమును సంహరింపవలయునని యెందఱో తలంచిరి. నెపోలియన్ 'రిపబ్లిక్' వారిపక్షమునకుఁ జెందియుండెను. టులాన్ వారు రణోన్ముఖులైరి. వారినణఁప సైన్యములు గుమిగూడెను. 'కార్టాక్సు' అను చిత్రలేఖకుఁ డొకఁడు సైన్యాధిపత్యము వహించెను; గాని యాతఁడు నిరుత్సాహమూనెను. 'డోపెట్' అను వైద్యశిఖామణి యొకఁడాతని స్థలమున నియోగింపఁ బడియెను. 'డోపెట్' నెపోలియన్‌గారిని బహూకరించెను. ఆతని యౌన్నత్యమును గ్రహించెను. రుధిరవాహిని మహావేగమునఁ బ్రవహించుచుండ, నాందోళనాధిక్యత చెప్పుడుపడుచు, టులాన్ రిపబ్లిక్ వారికి వశపడియెను. నెపోలియన్ సేనాధిపతి యాయెను.

తరువాత యాతఁడు 'సార్డినియా' సైన్యము నెదుర్కొనవలసివచ్చెను. అప్పు డాతఁడు భుజబలమునకు బుద్ధిబలము తోడుపడ, విద్వేషులఁ బరిభవించి, జయదుందుభి మ్రోగిం

చెను. నిశితకరవాలము కేలునలంకరింప, పరాక్రమక్రమము మధ్యందిన మార్తాండుని నిరసింప, విమతసేనాంగములు భయాధిక్యమున గడగడవడంక, దేశచరిత్రకారుఁడు తన లేఖిని యద్భుతమునకు నుప్పొంగ, నెపోలియన్ శూరాగ్రణి 1794వ. సంవత్సరమున ఇటలీరంగమందు జయరమను బడి యుంబాఁడ నిశ్చయించెను; గాని యాతఁడు ఫ్రెంచియధికారుల దురాగతమనుసరింప వలయును. ఒక యల్పసైన్యమున కాతని నధిపతిగా నియమించుట కధికారులు నిశ్చయించిరి. ఆతఁడంగీకరింపలేదు; ఆత్మగౌరవము హానిజెందునని కోపముతానెను. అందువలన నాతని నుద్యోగమునుండి తొలఁగించిరి.

నెపోలియన్ గారి కాశాభంగము గలిగెను. కొన్ని దినములవఱకాతఁడు మిక్కిలి నిరుపేదతనమున గోర్వవలసి వచ్చెను. 1795వ. సంవత్సరమున ఫ్రెంచిరాజ్యాంగ పునర్నిర్మాణము జరిగెను. ప్రతినిధు లుపపాదించిన తీర్మానములు ప్రజాంగీకారము వడసెను. ఈనూతన రాజ్యాంగము 'డిరక్టరీ' యనిపిలువఁబడియెను. దేశీయులు కొందఱు (అస్తమించిన రాజకుటుంబమునకుఁ జెందినవారు) ఆందోళనము నారంభించిరి; ఆగోలాహల మెల్లెడ నావరింపనుండెను. దేశమంతయును మఱల రుధిరవాహినిలో మునిఁగిపోవునాయని యందఱు దిగులొందిరి. నెపోలియన్ 'డిరక్టర్ల' భయమును దీర్చెను. వారాతనికి సైన్యముల దుపసేనానిగా నియోగిం



చిరి. సర్వసేనాధిపతి నెపోలియన్ గారి నెత్తింగినవాఁడగుట నాతనికే సైన్యముల నడుపుటకు నియమించి, తానువృత్తి వహించెను. ఆతఁడు భయంకరమూర్తియై దేశోపద్రవమును నిర్మూలించెను. తదనంతరమాతఁడు ఇటలీరంగమునకుఁ బంపఁ బడెను. "నాకరవాలము నాప్రక్కనున్నది. దానితో నే నెంతయో దూరమేగెదను!" అని యాతఁడు 'జోసిఫయిని' అను తన ప్రియాంగనతోఁ బలికెను.

నలుబదివేల సైనికులతో నాతఁడు 1796వ. సంవత్సరము మార్చి నెలలో ఇటలీదేశమునఁ గాలుపెట్టెను. శత్రుసమూహము నెట్లెదుర్కొనవలయునో గ్రహింపఁ గొలఁదికాలము గడిపెను. పెయిడ్మాంటునందు విప్లవము కల్పింపవలయునని యాతఁడాజ్ఞాపింపఁ బడియెను. ఆతనిపరాక్రమమునకు లోనై ఇటలీవారు సంధికొడంబడిరి. మే తే 15 దిని యాతఁడు మిలాన్ నగరమునఁ బ్రవేశించెను. అచ్చటిప్రజలు స్వాతంత్ర్యరాజ్యమున కెదురుచూచుచుండిరి. నెపోలియన్ సహాయమును గోరిరి. వారి ప్రార్థనల కాతఁడలరి ఫ్రెంచిరాజ్యాంగము ననుకరించి, వారిరాజ్యాంగమును నిర్మించెను. ఆతఁడిప్పుడు మిక్కిలి ధనవంతుఁడాయెను. తనసైన్యమును బలపఱచుకొని, యాతఁడు జాగరూకుఁడై యుండెను. ఫ్రెంచి 'డిరక్టరి' యాతని వర్తనమామోదింపలేదు. ఆతనిసైన్యమును రెండుసమభాగము లొనరింపవలయు ననియు, నందొక భాగమునకు వేఱొకని నధిపతిగా

నిలుపవలయుననియు వర్తమానమువచ్చెను. ఇంతియకాక నగరరాజములగు 'రోమ్, నేపుల్సు'లను ముట్టడింపవలయునని యు డిరెక్టర్లు ఉత్తరువుచేసిరి. నెపోలియన్ అంగీకరింపలేదు. మిలాన్ నగరమును విడచి యాతఁడు సైన్యయుతుఁడై యితర నగరములను వశపఱచుకొనఁ బ్రయాణమయ్యెను. ఆస్ట్రియా వారు నెపోలియన్ కాలుకదల్చినతోడనే విజృంభించిరి. ఆతఁడు తిరిగియరుదెంచెను. ఆస్ట్రియనుల మదమడంచెను. మిలాన్ వారి స్వాతంత్ర్యమును గాపాడెను. 'మాన్టువా' యనునగరము ఆస్ట్రియావారి యాధిపత్యము క్రిందనుండెను. ఇటలీరంగమున నిరంకుశాధికారము గడించి విహారము సల్పు ఆస్ట్రియనుల గీటడంచినఁగాని, ఇటలీదేశమును జయించుట దుస్సాధ్యమని యాతఁడెఱుంగును. 'మాన్టువా' ముట్టడి ప్రారంభమైనపు డాస్ట్రియనులు మిక్కిలిపట్టుదలతోఁ బోరాడిరి; గాని చాలనష్టము నకు లోనైరి. నెపోలియన్ విజయము వడసెను. ఇటలీదేశ మున నాస్ట్రియనుల యధికార మస్తమించెను.

ఫ్రెంచి దేశీయులు తమరాజును వధించి రాజ్యాంగ నిర్మాణమొనరించిన విధము రోమ్ నగరస్థుల హృదయశల్య మయ్యెను; ఫ్రెంచివారి నెదిరింప వారు సిద్ధపడిరి. 'నేపుల్సు' వారుసైన్యములను గూర్పసాగిరి; సార్డినియావారు పరాజితు లైన నాఁటనుండి కసిదీర్చుకొన నదను వేఁచియుండిరి. తక్కుం గల చిన్నచిన్న రాజ్యములు స్వాతంత్ర్య రాజ్యమునకుఁ



బోరాడ సన్నద్ధములై యుండెను. నిరంకుశ రాజ్యాధిపత్యము నడంపవలయుననియు, మతగురువుల దురంతవర్తన వ్యాపార ములు కడముట్టింపవలయుననియు, అధికారముద్ర వహించి, స్వార్థపరులై దేశమును పీడించువారిని నిర్మూలింపవలయునని, ఆత్మగౌరవము, ఆత్మవిశ్వాసము గాపాడవలయుననియు, స్వాతం త్ర్యమును సుస్థిరముగా స్థాపింపవలయుననియు, ఇటలీవారు బద్ధకంకణులైరి. ఆభాగ్యోదయ కాలమును నెపోలియన్ కని పెట్టెను. మతగురువుల నెదుర్కొని, జయించెను. వారుసంధి కోరిరి. మతగురువుల పాలనమునకు లోనైన రాజ్యముల నాతఁడు గ్రహించి నూతనరాజ్యాంగమును స్థాపించెను.

1797. వ. సంవత్సరమున నాతఁడు ఆస్ట్రియాదేశమును జయింప బయనమయ్యెను. అఱువదివేల సైనికులాతని వెంట నడచిరి. ఆస్ట్రియనులు భయోపేతులైరి. నెపోలియన్ బలమ సాధారణమని గ్రహించిరి. అపజయ మంగీకరించిరి. నెపోలి యన్ అప్రతిహత పరాక్రమ నిధియై మిలాన్ వెన్నిస్ నగ రములందుఁగల రమ్యహర్మ్యములందుఁ గడిపెను, చక్రవర్తుల స్వామ్యములు వహించెను. 'జోసిఫైని' యనుపేరంబరగు తనకాంతనురప్పించి, యూరేగుమహోత్సవమున నానందించెను. ఇటలీ దేశమాత మనోఘనమని యాతని నెల్లరు సంభావించిరి.

బెల్జియమ్ రాజ్యమును గ్రహింపవలయునని ఫ్రెంచి వారియాశ. నెపోలియన్ కూడ యట్టియుద్దేశమునే కలిగియుండిరి

డెను. బెల్జియమ్ వారి నెదుర్కొనుట నిశ్చయమని ఆస్ట్రియనులతో సంధి తప్పక యొనరింపవలయును. 1797. వ. సంవత్సరమున నాయోధుఁడు ఆస్ట్రియనులతోఁ బోరాటము మానుకొనియెను. పరాసునగరమున కరుదెంచెను. పరాసువా రాతని నత్యంతానందముతో నాహ్వానమొనరించిరి. విందు లొసఁగిరి; వందిమాగధులవలె నాతని నుతించిరి, డిరక్టరు లాతని నసూయభావముతోఁ జూచువారైనను, ఆనాఁడానందము సూచించిరి; ఆతనినభినందించిరి. నెపోలియన్ రాజసముట్టిపడ, చిఱునవ్వునవ్వక, దివ్యపురుషునివలె వర్తించెను. "ఫ్రెంచి రాజ్యాంగమున మార్పు కావలసియున్నది." అని మాత్ర మాతఁడు వచించెను.

ఫ్రెంచిరిపబ్లిక్ వారి నణఁప వలయునని ఇంగ్లాండువారు నిశ్చయించిరి. ఫ్రెంచివారు నెపోలియన్ యాధిపత్యము క్రింద నౌకవాహిని నియమించిరి; ఇంగ్లాండు నెదిరింప నాతని నియోగించిరి. ఆతఁడు బౌలోన్ నుండి డన్ కర్కున కరుదెంచెను. ఇంగ్లాండువారి బలాధిక్యమును గ్రహించెను. ఆతని యుద్దేశ మింకొకవైపు పోయెను. ఈజిప్టు దేశమును జయింపవలయునని యాతఁడూహించెను. 'మాల్టా' ముట్టడిముగించిన తరువాత ఈజిప్టుపై కేగనిశ్చయించెను. మాల్టావా రాతనికి తక్షణము లొన్గైరి. తదనంతర మాతఁడు నిర్భయముగా లిబియన్ సముద్రమునఁ బ్రయాణముసేయఁగడంగెను అలెగ్జాండ్రియానగ



రము కన్నులపండువుగాఁ గనఁబడుసమయమున నాంగ్ల నౌకాధ్యక్షుఁడు, దీర్ఘదర్శి నెల్సన్ మహాపురుషుఁడు నౌకాదళముతో నాతని నెదుర్కొనియెను. ఇరువైపులవారికిని పోరు ప్రారంభమాయెను. ఫ్రెంచిసేన సాహసముజూపెను; గాని కార్యము లేకపోయెను. ఆంగ్లేయులు విజయపతాక మెత్తిరి.

నెపోలియన్ ఈజిప్టుదేశమును చాలమట్టు నాక్రమించుకొనియెను. పరిశ్రమములుస్థాపించెను; యంత్రశాలలు నిర్మించెను; ముద్రాయంత్రములు కూడ నెలకొల్పెను; కాల్వలు త్రవ్వించెను; వ్యవసాయాభివృద్ధికి వ్యయ ప్రయాసముల కోర్చెను.

ఐరోపా దేశమునఁగల రాజులను పద భ్రష్టులఁ జేయ వలయుననియు, ప్రజాస్వాతంత్ర్యము రక్షింపవలయునని ప్రయత్నములు జరుగసాగెను. తత్కారణమున నెక్కడ చూచినను అల్లరులు పెఱుగసాగెను. నెపోలియన్ మాల్టాను ముట్టడించుటయును, ఈజిప్టుపై దాడివెడలుటయును జూచి రష్యావారు టర్కీవారితో సఖ్యముఁ గావించుకొనిరి. నెపోలియన్ విదేశముననుండుటఁగాంచి నిస్తేజులైన ఆస్ట్రియనులు కత్తిదూసిరి. ఇంగ్లాండు దేశీయులు వారికి తోడ్పడి నిల్చిరి. మఱియు నెన్నియో రాజ్యములవారు వారికి సహాయమొనరించిరి. ఫ్రాన్సు దేశము విపదబ్ధిమధ్యమునఁ బడియెను. ఈజిప్టునందుఁగల నెపోలియన్ ఈదుర్వార్త నాలించెను. సత్వరమ యాతఁడుచోటువీడ్కొలి

పెను. మార్గమధ్యమున రెండువేలమంది తురుష్క సైనికులను బట్టిబంధించెను. పిమ్మట వారలనందఱను వధించెను! అట్టి కఠినకృత్య మాతఁ డింకెన్నఁడు నొనరించియుండలేదు.

పరాసునగరమున కాతఁడే తెంచెను. 'డైరెక్టర్' వారు చెల్లాచెదరై యుండిరి. నెపోలియన్ దూరదృష్టిగల వాఁడు కావున కర్తవ్యమెఱింగెను. దేశోన్నతికి ప్రధానమగు ప్రజాసమూహ మాతని కైదండ చేకొనియెను. పరాసునగర వాస్తవ్యులలో మేధానిధులు, ధనాధిక్యులు, పరాక్రమోపేతులు, కూడ యాతనియనుజ్ఞకై వేచియుండిరి. వీరావతారుఁడగు నెపోలియన్ ఫ్రాన్సుదేశమాత నుద్ధరింపఁగలవాఁడని వారిదృఢనమ్మకము.

రాజ్యాంగమున మార్పు నిశ్చయముగా కావలయునని నెపోలియన్ నమ్మెను. 'డైరెక్టర్లు' దేశమున శాంతము నిలవరింపఁ జా[illegible] అంతఃకలహములను తోఁడు శత్రురాజుల విజృంభణము నానాఁటి కధికము కాఁజొచ్చెను. 'డైరెక్టరీ' విధ్వంసమున కాతఁడు గడంగెను. సైన్యములను గూర్చెను పురికొల్పెను; కృపాణపాణియై ముందునడచెను. 'డైరెక్టర్లు' కోపారుణితనేత్రులైరి. వెనుకీసిన నధికార మస్తమించును వారెదురై నిల్చిరి; గాని మార్తాండమరీచి సోఁకిన మంచు కరఁగకుండునా?

నెపోలియన్ 'ఫస్టుకాన్సల్'గా నెన్నికొనఁబడియెను.



ఫ్రాన్సుదేశము మహోన్నత పదవినుండి దుర్గతికి వచ్చెను. దేశమును సుస్థితికిఁ దేవలయునని యాతని ముఖ్యోద్దేశము. కోశాగారమున ధనమించుకంతైనను లేదు. ధనికులను ప్రోత్సహించి, నమ్మకము జెప్పి యాతఁడు ఋణములు చేసెను. 'గాడిన్' అను బుద్ధిశాలి సహాయమున నాతఁడు దేశాభివృద్ధి చేయఁగలిగెను. ఆదాయవ్యయములు లాభకరముగా జరుపఁబడియెను; పన్నులు ప్రజాహితమునుగోరి వసూలు చేయఁబడియెను; 'కాఁగితముపొమ్ము' క్రమముగఁ దగ్గింపఁబడియెను. దేశము ధనవంతమయ్యెను; చాలచోట్ల శాంతము నెలకొనియెను; గాని పశ్చిమభాగమున మాత్రము భూస్వాములు కొందఱు 1799వ. సంవత్సరమున నాంగ్లేయుల ధనసహాయము వలన నల్లరి ప్రారంభించిరి. అఱువదివేల సైన్యముతో నాతఁడు వారలకెదురేగి యపజయమొందించెను; వారలను మన్నించెను. దేశభక్తి కలిగియుండుఁడని హితవుగఁ జెప్పెను. మతగురువు లందాతఁడు చూపినగౌరవము కూడ కడుంగడు శ్లాఘనీయము. మతసంస్కరణములు కొన్ని యొనరించెను. రక్షకభటవర్గమునఁగూడ కొన్నిమార్పు లొనరించెను. బాటలు గట్టించియు, వారధులు బాగుచేయించియు, వర్తకవ్యాపారములు సుకరముగా జరుగునట్లు పాటుపడియెను.

ఫ్రాన్సు దేశాధిపత్యము వహించిన సమయమున నాతఁడు సుబుద్ధియై ఇంగ్లాండు, ఆస్ట్రియా దేశములతో సంధి

గాపాడుకొనదలఁచెను; తనయభిమతమెఱింగించెను; గాని యా దేశము వారంగీకరింపలేదు. తనభయంకర కరవాలమే జయము ప్రసాదించునని యాతఁడు తలంచెను! 1800వ. సంవత్సరమున ఆస్ట్రియనులు పూర్తిగా నోడింపఁబడిరి; సంధి కుదుర్పఁబడెను. సంధిషరతుల ప్రకారము బెల్జియమ్ దేశము, రైను నది పశ్చిమతీరమంతయు, ఫ్రాన్సున కొసంగఁబడెను. ఇటలీ దేశమంతయు నెపోలియన్ యధికారమునకు లోనయ్యెను. కొలఁది కాలముక్రిందట ప్రపంచపటమునుండి యదృశ్యమొంద నుండిన ఫ్రాన్సుదేశము నెపోలియన్ వీరశేఖరుని యాధిపత్యము క్రింద నత్యున్నతపదవికి వచ్చెను. ఎడ్రియాటిక్ తీరమునుండి నెదర్లాండ్సువఱకు ఫ్రెంచివారి బలమభేద్యమై, యూరోపున భయంకరమై, నిరుపమానమై వెలసెను. ఇంగ్లాండు దేశము మాత్రము భయమునొందలేదు. నెపోలియన్ కూడ ఆంగ్లేయుల యుత్సాహమును గ్రహించెను. సముద్రాధిపత్యమాంగ్లేయులకుఁ జెందియుండెను. అయినను, నెపోలియన్ భయపడ లేదు. రష్యాచక్రవర్తితో సఖ్యము గావించుకొనియెను; 'మాల్టా' నొసంగెదనని వాగ్దానమొనరించెను. మాల్టా యాంగ్లేయులచే నాక్రమింపఁబడియుండెను. రష్యాచక్రవర్తి మోసగింపఁబడియెను; గాని యాచక్రవర్తి రణరంగమును వీక్షించు భాగ్యము పొంద లేదు. నిద్రావస్థలో నుండఁగ పుర దురాత్ములాతనిని వధించిరి. ఆతనికుమారుఁడు అలెగ్జాండర్ రష్యా సింహాసన మధి



ష్ఠించెను. ఫ్రెంచివారితో నాతఁడు సఖ్యముగానుండినను, యుద్ధములోఁ జేరుట కంగీకరింపలేదు; వర్తకము నశించునని భయపడియెను.

ఆంగ్లేయ విజృంభణము నానాఁటి కధికమయ్యెను. ఈజిప్టు దేశమున ఫ్రెంచివారి యధికారము నిర్మూలింపవలయునని వారు ప్రయత్నములు సేయసాగిరి. మధ్యధరాసముద్రాధిపత్యముగల వారికాకృత్యము కష్టతరముకాదు. యుద్ధము ముగియకమునుపే యాంగ్లేయులు సంధిజేసికొననెంచిరి. ఫ్రెంచివారంగీకరించిరి.

ఫ్రెంచివారిబలము యూరోపునందంతట దట్టముగాఁ బెరిగిపోయెను. ఆంగ్లేయులబలము సముద్రములపై నిరుపమానమై ప్రజ్వరిల్లెను. 'ఫ్రాన్సు,' 'స్పెయిన్' దేశముల నౌకాదళములెన్నియో యాంగ్లేయులచే నాశనమొందింపఁబడియెను. భరతఖండమున నాంగ్లేయాధికారము స్థాపింపఁబడియెను. ఫ్రెంచివారు పోర్చుగల్ దేశముపై దాడివెడలుడని స్పెయిన్ వారినిఁ బ్రోత్సహించిరి; గాని వారంగీకరింపలేదు. ఈజిప్టునందు పరాసుల యధికారము క్షీణింపసాగెను. ఆకారణమున నెపోలియన్ సమరవ్యాపారము కొంతకాలము మానుకొనుట శ్రేయమని తలంచెను. 1802. వ. సంవత్సరము మార్చి నెలలో 'ఎమియాన్సు' వద్ద సంధిపత్రము లిఖింపఁబడియెను

ఆసంధిషరతుల ననుసరించి ఇంగ్లాండువారు ట్రినిడాడ్, సిలన్ (లంకాద్వీపము) వడసిరి; గాని ఫ్రెంచివారినుండి గ్రహించిన తావులు వారికి మఱల యొసంగిరి. మాల్టాద్వీపము దాని యధీశ్వరుల కొసంగఁబడెను. సంధిషరతులు ఖండితముగాఁ జూపట్టలేదు. అందు లోపములున్నటు లందఱును తలంచిరి. సంధియొడంబడిక సుస్థిరతవహించునని యెవ్వరునునమ్మలేదు. కొలఁదికాలములో మహాసంగ్రామము సంప్రాప్తించునని యెల్లరు భయపడిరి.

యూరోపుదేశ రాజు లందఱును నెపోలియన్ పాదాక్రాంతులైరి. కార్సికాద్వీపమున నొక బీదకుటుంబమందు జన్మించిరి. ఫ్రెంచిసైనికోద్యోగమునఁ బేరెన్నిక కెక్కి శత్రువుల దర్ప మడంచి, బలవిహీనమై యస్తమింపనుండిన ఫ్రాన్సు దేశమును తేజోవంత మొనరించి, నిరుపమాన బలసంగతముగాఁ జేసి, యధికార ముద్రగైకొనిన యాతనింగాంచి యెల్లరాశ్చర్య మొందిరి. ఆతని కృపాణధార నెఱుంగనివారేలేరైరి! ప్రష్యా దేశమునందుననేగాక, ఆస్ట్రియా, ఇంగ్లాండు దేశములందుఁగూడ యాతని నామము సర్వజనజిహ్వారంగముల విలసిల్లెను. రాజోచిత విధుల నాతఁడు గమనింపసాగెను. నిరంకుశాధికారము బూన మొదలిడెను. ఎన్నియో సంస్కరణము లొనరించెను. శాసనసభలందు ప్రజాప్రతినిధులకు ప్రథమస్థాన మొసంగెను.



అప్పటి న్యాయపద్ధతులు దేశాభివృద్ధి ననుసరించి యుండలేదు. ప్రజాహితమును గోరి యాతఁ డుచితరీతి న్యాయపద్ధతులను సవరించెను. విద్యావ్యాపకమునకు వలయు సదుపాయములను విరివిగాఁ జేసెను.

1803. వ. సంవత్సరము మే నెలలో నింగ్లాండు ఫ్రాన్సులకు యుద్ధారంభమాయెను. ఆమహాసంగ్రామము వలన దేశోపద్రవము సంభవించెను; ఫ్రెంచిపతాక వినువీధి నంటెను నెపోలియన్ అసమానవీరమూర్తియై శత్రుల గుండియలు జల్లుపఱచెను; గాని యుద్ధానంతరమున నాతఁడు పదచ్యుతుఁడై కారాగారమున దినములు చాలించెను. ఇంగ్లాండు దేశము కష్టములపాలయ్యెను; సంఘవర్ధిష్ణుత నిలిచిపోయెను; గాని చివరకు జయము వడసెను. ఈ యితిహాసమును మన మెఱుంగవలసి యున్నది.

ఆంగ్లేయనౌకలు సముద్ర మీసినటుల విలసిల్లెను. ఫ్రెంచివర్తకుల కొందఱి నాంగ్లేయులు బంధించిరి. ఆదుర్వార్త వీనులసోఁకిన యుత్తరక్షణముననే నెపోలియన్ కోపాక్రాంతుఁడై ఫ్రాన్సుదేశమున వసతు లేర్పఱుకొనిన ఆంగ్లేయులను కారాగృహమునఁ బెట్టెను. 'ఇంగ్లీషుఛానల్'ను దాటి ఇంగ్లాండును ధ్వంసము సేయవలయునని ప్రయత్నించెను. పదిలక్షల ఆఱువదివేల సైన్యముతో బయలువెడలెను. ఆమహాసైన్య

మును ఇంగ్లాండునకుఁ గొనిపోవుటకు నౌకలు కావలయును. ఆతఁడు నలువైపులుచూచెను. ‘ ఆన్టివర్ప్ ’ నగరమున నౌకానిర్మాణమునకు నెందరినో నియోగించెను. 1804. వ. సంవత్సరమున ‘ బౌలోన్ ’ తీరమున నెన్నియో నౌకలు గన్పట్టెను. ఆంగ్లేయు లానౌకాదళమును నిర్మూలింపఁ బ్రయత్నించి విఫలమనోరథులైరి.

ఆదినములందు కొందఱు దేశద్రోహులు నెపోలియన్ ప్రాణములను హరింపఁ దరుణము వేఁచియుండిరి; గాని వారి దురంతము బయలు పడియెను. తాటియాకుల చప్పుళ్లకు కుందేలు జడియునా? ఆదుర్మార్గులను కొందఱి నురిదీయించియుఁ, గొందఱిని కారాగృహమున బంధించియుఁ, గొందఱిని దేశభ్రష్టులనొనరించియు, శిక్షించెను. ఐరోపా రాజులందఱును నెపోలియన్ గారి సాహసౌదార్యముల కాత్మలందు కోపగించినను, పైకేమియు ననఁజాలకుండిరి. నెపోలియన్ నిర్భయముగా దాను ఫ్రెంచిచక్రవర్తి నని ప్రకటించెను. తన మరణానంతరము తనకుమారులు సింహాసన మెక్కునటుల స్థిరపరచెను; తనకు బుత్రులు లేనియెడల, తన సోదరులు గద్దెనెక్కుట కర్హులని శాసనముచేసెను. 1804. వ. సంవత్సరము డిశంబరు తే 2దిని యాతని పట్టాభిషేక మహోత్సవముజరిగెను. ప్రజాసమూహ ముప్పొంగెను! మహాపురుషుఁడు తమకేలిక యయ్యె



నని వారు దేవునకు కృతజ్ఞతాపూర్వక వందనములాచరించిరి.

ఇటలీ దేశాధిపత్యమును మరల వశయనెంచి యాస్ట్రియనులు రహస్యప్రయత్నములు సేయఁజొచ్చిరి; రష్యావారు పూర్వపుస్నేహలతను ద్రెంపి, మెల్లమెల్లన ఫ్రెంచివారిపై కరుదెంచుచుండిరి; రష్యావారు నెపోలియన్ పేరు వినినప్పుడు గడగడవణఁకు చుండువారయ్యు, సమరమభిలషించుచుండిరి. ఇంగ్లాండుదేశీయు లత్యంతోత్సాహ భరితులై ఫ్రెంచివారి గర్వము సర్వముమాపుమాప నెదురుచూచుచుండిరి; దేశీయుల యుత్సాహబలము నిరంతరమగుట మంత్రిశిఖామణి ‘విలియమ్‌పిట్టు’ తనకిష్టము లేకుండినను, సమరముగోరవలసి వచ్చెను. 1805వ. సంవత్సరమున ఆస్ట్రియా, రష్యా, ప్రష్యా, ఇంగ్లాండుమున్నగు దేశములవారు ఫ్రాన్సున కెదురైనిల్చిరి. మిత్రమండలి ప్రయత్నములను నెపోలియన్ ఎఱుంగకపోలేదు. మిత్రమండలిలో నన్యోన్య కలహము లాపాదింప వలయునని యాతనియుద్దేశము. ‘ ఇంగ్లీషుఛానల్ ’ నం దాతనికి జయములభింపలేదు. ‘ సముద్రముమీఁద నాంగ్లేయుల నెదుర్కొనుట యసంభవమని ’ యాతఁడు గ్రహించెను. ఆకారణమున నాంగ్లేయుల వర్తకమును భంగపెట్టవలయుననియుఁ, నాంగ్లేయులమిత్రులను వారినుండి దూరముసేయవలయుననియు నిశ్చయించెను. అప్పుడు జరిగినయుద్ధములలో సుప్రసిద్ధములు

'ట్రిఫాల్గర్,' 'ఆస్టర్లిట్జి', మొదటిది నౌకాయుద్ధము. ఇంగ్లాండువారు జయమువడసిరి; గాని నౌకాధ్యక్షుఁడు నెలసన్ యోధాగ్రణిమరణించెను. రెండవయుద్ధమున నెపోలియన్ విజయుఁడయ్యెను. తరువాత జరిగిన సంగ్రామములందాతఁడు విజయుఁడైనను, కడకు అపజయమునుపడసెను. ఇంగ్లీషువారి వర్తకవ్యాపారములను నిరోధింప నాతఁడొనరించిన ప్రయత్నములన్నియు నిష్ఫలములయ్యెను. మిత్రమండలివారు మిక్కిలిపట్టుదలతో యుద్ధమును నడపిరి. 1813వ. సంవత్సరము డిశంబరు నెలాఖరులో వారు ఫ్రాన్సుపై దండెత్తిరి. నెపోలియన్ మిత్రమండలివారి యుద్దేశమెఱింగెను. “క్రిందటి సంవత్సరమైరోపాదేశము ఫ్రెంచిసేనలతో నడచెను; నేఁడు ఇంగ్లాండుతో నడచుచున్నది!” అని యాతఁడు పలికెను.

ఫ్రెంచిసేన లుత్సాహము ప్రదర్శింపలేదు. రోగమువలనను, ప్రయాసమువలనను, గదలుటకైన శక్యములేకయుండెను. నెపోలియన్ వెనుదీయఁడయ్యె. 1814వ. సంవత్సరము జనవరి మాసాంతరమున నాతఁడు మిత్రమండలివారి నెదుర్కొనియెను. సంధికార్యములు ఫలించలేదు; కరవాలమే జయరమయనుగ్రహమును దెలుపఁగలదని యిరువైపులవారును నిశ్చయించిరి. ఈయుద్ధమున జయమువడసినఁ దనకిరీటము స్థిరముగా నుండును; రాజదండము హస్తమును విడువదు. నెపోలి



యన్ పొందిన సంభ్రమ మింతింతకాదు. ఆనవీనోత్సాహబలమున నాతఁడు ధారుణీవలయమును ఒంటరిగా జయింపఁగలనని ధైర్యమూనెను; గాని యుద్ధమారంభమై, భయంకరముగాఁ జూపట్టిన సమయమున నాతనిని ప్రోత్సహించిన వారే మిత్రమండలితోఁ జేరిరి. ఆతఁడొకింత విచారించెను; ధైర్యము విడువలేదు. ఫ్రాన్సుదేశము అంధకారబంధురమై దిక్కులేక దీనదశయందుండినపుడు, మార్తాండునివలె పొడసూపి, దేశమున శాంతము నెలకొల్పి, బలపఱచి, యద్వితీయమొనరించి,

నిరుపమాన ప్రజ్ఞానిధియని పేరువడసిన మహాత్ముఁడు, కడకు దేశీయుల కోపాగ్నికి నింధనమై, మిత్రులచే విడువఁబడి, శత్రుల బలాధిక్యమును జూచి, మిక్కిలిదుఃఖించెను; ఆతనికి బ్రతుకు భరమై కన్పట్టెను; ఆతఁడు విషపాన మొనరించెను.

మరణదేవత కరుణించలేదు. కిరీటమునువిడచి, ఎల్బాద్వీపమున కాతఁడు మిత్రమండలిచేఁ బంపఁబడియెను. ఫ్రాన్సుదేశమను మహీధరమున నుదయించిన విభాకరుఁడు వీతప్రభావుఁడై శిరంబువాల్చి, మనోగతమున నిట్టిదట్టిదని వచింపరాని వేదన యినుమడింప జీవములపై నాశగోల్పడి 'ఎల్బా' చేరుకొనియెను.

ఫ్రెంచివారు పదునెనిమిదవ లూయీని చక్రవర్తిగా నెన్నుకొనిరి. ఆతఁడు సింహాసన మలంకరించెను. దేశమున

సరాచకము ప్రారంభమయ్యెను. మిత్రమండలి ఫ్రెంచివారి స్వామ్యములను గణింపరైరి. ఫ్రాన్సుదేశము నిర్మూలముగా నశించునేమోయను భయ మాదేశప్రజల బాధించెను.

ఎల్బాద్వీపమున నెపోలియన్ ఎన్నియో దినములుండ లేదు. సామ్రాజ్యాధిపత్యమునకుఁ బ్రయత్నము లారంభించెను. మిత్రమండలివారు 'వియన్నా' నగరమునఁ జేరి సంధి పరతులు చర్చింపసాగిరి. చండమారుతమువలె నెపోలియన్ అరుదెంచెను. సైనికులమధ్య నిలువంబడి గంభీరముగా, "ఈ ప్రచండవాహినీ సముదయమునఁ దండ్రినిఁ జంపనెంచు ఖలుఁడెవ్వఁడు కలఁడు!" అనిపలికెను. ఫ్రెంచివాహిని కాతఁడు జనకసమానుఁడు. ఆజగదేకవీరునిఁ గాంచినపుడు ఫ్రెంచిసైనికులు సముద్రమువలె పొంగిపోయిరి. పదునెనిమిదవ లూయీ 'సింహాసనమువిడిచి పారి' పోయెను. రుధిరనష్టము కలుగకుండ నెపోలియన్‌నకు సింహాసనము లభించెను.

మిత్రమండలి మిన్నకుండలేదు. ఘోరంబగు పోరు సంప్రాప్తించెను. 'వెల్లింగుటన్' ప్రభు వాంగ్లేయసైన్యాధిపతి. ఆతఁడు దీర్ఘదర్శి; సైనికనిర్మాత; కార్యపరతంత్రుఁడు. 'వాటర్‌టూ' యొద్ద జరిగిన సంగరమున నింగ్లీషువారు విజయులైరి. యోధాగ్రణి నెపోలియన్ నిరుత్సాహ మొందెను. సింహాసనమునువిడచి, యాంగ్లేయులకు వశుఁడయ్యెను. 1815వ.



సంవత్సరమున నాతఁడు సెంటు హెలినాకుఁ బంపబడెను. ఆతని కరవాలము—రివోలి, జేనా, ఆస్టర్లిట్జి మున్నగు సంగ్రామరంగముల నెన్నికగన్న కరవాలము—ఆంగ్లేయుల యధీనమయ్యెను. హెలీనాయం దాతఁడు కారాబద్ధుఁడుగాఁ జేయఁబడెను; గాని యాతని కెట్టికష్టములను కలుగకుండ ఆంగ్లేయులు జాగ్రత్తవహించిరి. హెలీనాయం దాతఁడు శాంతమతియై తన యవసానకాలము గడిపెను. దినమందు కొంతసేపు మతగ్రంథములు చదువును; సంతోషించును. అట్లుకొన్నాళ్లు గడచిన వెనుక, ఆతఁడు బలముగోల్పడియెను. ఆరోగ్యము క్రమముగా క్షీణింపసాగెను. ఆతనికుటుంబీకులు, స్నేహితులు, గురువులు సతత మాతని మనోపథముననే యుండిరి. సెయిన్‌నదీతీరమునఁ దనగోరీ కట్టవలయునని యాతఁడుకోరెను. "నాప్రేమైకనిధానులగు ఫ్రెంచివారి సమక్షమున నేను విశ్రమించెదను!" అనియాతఁడు పలికెను. 1820వ. సంవత్సరము మేనెల తే 5దిని యాతఁడు ప్రాణములువిడచెను; ప్రాణములు ఠావులు దప్పుటకు ముందాతఁడు చాలప్రయాసము పడియెను. ఆంగ్లేయులాతని శవమును ఫ్రెంచిదేశీయుల కొసంగిరి.

ఆతఁడు సౌందర్యవంతుఁడు. ఆతని మందహాసము మధురతరము. ఆతని కటాక్షములు రూక్షణములైనను, కరుణారసమును జిమ్ముచుండెను. ఆతఁడు మిక్కిలి పొడుగైన

వాఁడుకాఁడు; 'గాని సింహాసంహానుఁడు; బలశాలి. చిన్నతనమున నాతఁడు మితభాషణుఁడై యుండినను, గౌమారదశారంభమున నానందమయుఁడై, సంభాషణాభిలాషగలిగి, మిత్రులమధ్య మిత్రునివలె వెలుగసాగెను. ప్రపంచచరిత్రమందాతఁడమరుఁడై, దేశీయులకే కాక సర్వజనములకును సంస్మరణీయుఁడై యున్నాఁడు.



శ్రీ మేరీ ముద్రాక్షరశాల,—రాయవరము 1917.

# ప్రకటింపబడిన గ్రంథములు



| | చందాదారులకు | ఇతరులకు |
|---|---|---|
| 1 చిత్రరేఖ | 0—8—0 | 0—10—0 |
| 2 రాజహంస | 0—12—0 | 1—0—0 |
| శేషీప్రసన్నము | ఉచితము | దొరకదు |
| శేషధర్మము | 0—3—0 | 0—4—0 |
| 3 లలితకుమారి | 0—8—0 | 0—10—0 |
| కమలాకుమారి | 1—0—0 | 1—2—0 |
| 3 శ్రీందేవి | 0—8—0 | 0—10—0 |
| మొగలితూరు కైఫీయతు | 0—1—0 | 0—1—6 |
| పూసపాటివారి వృత్తాంతము | 0—6—0 | 0—8—0 |
| కిమ్మూరు కైఫీయతు | 0—1—6 | 0—2—0 |
| 2 బొబ్బిలిముట్టడి చరిత్ర | 0—1—6 | 0—2—0 |
| కొరుకొండ కైఫీయతు | 0—2—0 | 0—3—0 |
| చామర్లకోట కైఫీయతు | 0—3—0 | 0—4—0 |
| 2 సుభద్రాచలము | 0—3—0 | 0—4—0 |
| ప్రణయసరణి | 0—12—0 | 1—0—0 |
| 2 ఘోరకలి | 0—2—0 | 0—3—0 |
| గుణరత్నావళి | 0—8—0 | 0—10—0 |
| 3 వికటవివాహము | 0—10—0 | 0—12—0 |
| 3 శాంత | 0—6—0 | 0—8—0 |
| 1 దేశోద్ధారకులు | 0—8—0 | 1—0—0 |
| పెద్దాపుర సంస్థానచరిత్ర | 0—8—0 | 0—10—0 |

1 ఈగురుతుగల పుస్తకములు దొరతనమువారిచే అప్రూవు (Approve) చేయబడినవి.

2 ఈగురుతుగల పుస్తకములు కావలెనన్నను దొరకవు.

3 ఈగురుతుగలపుస్తకముల వెలలు త్వరలో పెంచబడును.

వలయువారు;— ఆంధ్రసారస్వతనికేతనము, రాజమండ్రి.

